1985 పెద్దలు శ్రీ పొందనేపాల కృష్ణశాస్త్రి గారికి

నమస్కారములతో
రమాపతిరావు.

# శతదళం

25/12/

(కవితా సంపుటి)



శ్యామకృష్ణ
సంకలితం

ఈ సంపుటిలో


| | | |
|---|---|---|
| కొడాలి ఆంజనేయులు | 1 | పెండ్లి కూతురు |
| విశ్వనాథ సత్యనారాయణ | 2 | వాసంతిక |
| దేవులపల్లి కృష్ణశాస్త్రి | 5 | పల్లకీ |
| కాటూరి వెంకటేశ్వరరావు | 6 | సౌందర్య లహరి |
| నాయని సుబ్బారావు | 8 | ముసి పుట్టినగాథ |
| శ్రీ శ్రీ | 10 | కలకాలం |
| బాలగంగాధర తిలక్ | 11 | స్వయంవర |
| ఆరుద్ర | 15 | ఉగాది : కాలం |
| పిలకా గణపతిశాస్త్రి | 21 | శిశిర ప్రభాతము |
| బైరాగి | 23 | నాక్షాంచెం నమ్మక మివ్వు |
| ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి | 25 | నదీలక్ష్మి |
| దాశరథి | 28 | అచుంబితం |
| మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి | 32 | శైక్ష్యోపాధ్యాయిక |
| పుట్టపర్తి నారాయణాచార్యులు | 36 | కైకేయి |
| మల్లంపల్లి శరభయ్య | 39 | ఆవిష్కారము |
| విద్వాన్ విశ్వం | 45 | వెయ్యేళ్ళ పాట |
| సుప్రసన్న | 51 | సాహస్ర మాన్మథము |
| శ్రీ శ్రీ | 54 | పిచ్చి దానిమ్మచెట్టు |

| | | |
|---|---|---|
| సంపత్కుమార | 57 | వాంఛాసమితి |
| రమణారెడ్డి | 60 | విశ్వ వత్సల |
| బాలగంగాధర తిలక్ | 62 | సంగీత వృత్తము |
| కుందుర్తి ఆంజనేయులు | 64 | నగరంలో వాన |
| ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి | 65 | గోదావరి |
| అజంతా | 78 | చెట్లు కూలుతున్న దృశ్యం |
| పిలకా గణపతిశాస్త్రి | 83 | కలలో పిలుపు |
| బెల్లంకొండ రామదాసు | 84 | నిష్క్రమణం |
| సి. నారాయణరెడ్డి | 87 | లోకాలోకము |
| మాదిరాజు రంగారావు | 90 | సౌందర్య శిఖ |
| గోపాల చక్రవర్తి | 92 | కలహించిన అబ్బాయి / అమ్మాయి |




రోహిణీదేవి

రమాపతిరావు (మంజుశ్రీ)

దంపతులకు

పెళ్ళికానుక

—మిత్రులు

20222

# పెండ్లి కూతురు

కనుగవ తల్లిగా రిడిన కాటుక రేకల బ్రేమవల్లికల్
పెనచి త్రపాప్రసూన మధులేశములన్ మిళితంబులైన వీ
క్షణముల ని న్నొరుల్ గనని చందమునన్ వరుగాంచు నీకు యౌ
వన మధుమాస యామినులు ప్రాప్తము లయ్యెడుగాక శీఘ్రమే !

త్వాదృశ బాలికల్, తలుపుదగ్గర బాటలు వాడు పెద్ద ము
త్తైదులు, భర్తపే రడిగినప్పుడు తీగయొలుంగు ముగ్ధతన్
బేదవడంగ, "వంతు మన పెండ్లికుమారుని" దన్న నీదు ల
జ్జా దరహాస చంద్రికలు శాశ్వతమై వెదజల్లు గావుతన్ !

పగడపు మోవికెంపులకు బైపయి దాగుడు మూతలాడు లే
నగవు గులాబి పూసరమునన్ విరిమల్లెలు తాపినట్లు దో
పగ, బతియుత్తరీయ మధుపర్కము గేల గ్రహించి, వెంట జం
టగ జను నమ్రభావము లనారతమున్ నిను బాయకుండుతన్ !

'పునుగు జవాది తావులు గుబుల్కొను నీ పసుపుంబయంట కొం
గున ముడివైచికొంటిగద కోమలి, నీ మగడింక నెట్టు చె
ప్పిన నటులే వినంగలడు, పెండ్లము గీచిన గీటు దాట' డం
చును వదినల్ నగన్ జురుకుచూపుల జూచెదు నీకు సౌఖ్యమౌ !

వేసంగి సందెల విరిమల్లెపూలు
పరచిన ముత్యాల పాలకీలోన
నూరేగునాటి నీ యుత్సాహ దివ్య
మధుర దృశ్యంబులు మరతుమే మేము,
చుక్కల రథములో నెక్కి వేంచేయు
ఒక చందమామ మా కున్నంత వరకు !

— కొడాలి ఆంజనేయులు

## వాసంతిక

మఱునాడు శ్రీరామ మహితాభిషేకంబు
మాండవీ సిత సౌధ మండలికిని
ఇక్ష్వాకు కుల యోగ్య హీరాది భూషణ
భూషితాకారుడై పోయె భరతుఁ
డంగణ దేశంబు రంగవల్లులతో న
భంగవల్లులతో కుడుంగరచన
దిద్దగాఁ బడి వితర్దిక తీర్చగాఁ బడి
కూర్చుండె భరతుండు కోమలికయి

కేలు మోడ్చుచు దాన సంస్కృత శిరోజ
పలిత కాషాయ పరిధాన వచ్చె సుదతి
ఇంతిఁ గనుగొంచు భరతుని హృదయ పద్మ
కేసరంబులు విడజారె భాసురములు

అంతట దేహళీ పరిసరావనిఁ బాతిన మొక్కనాటి వా
సంతిక సన్నలేఁజివురు సాగిన సోగ నవారుణాచ్ఛవిన్
చెంతల నొక్కపూవు వికసింపక యుండిన జూచి 'ఇద్ది చూ
లెంతయు గా' దటన్న తెమలించుక మాండవి పల్కె నీ గతిన్

'నే నింటిలోన నెక్కడొ
పూని మహా వ్రతము నెఱపఁ బూ మొక్కలకున్
దా నెవరు నీరు పోసిరి
చాన యదుపు తోటమాలి శ్రద్ధయు గలదే!'

అన భరతుండు 'నేటికి మహావ్రత మూనెద' వన్న "భర్త యొ
ల్లని సతి యంతకంటె నవలన్ వ్రతమూనక ఏమిచేయు, వం
చన చెడిపోయినట్టి గృహ సంస్కృతి సంస్కృతి కే వ్రతంబు పూ
నిన యది నేటికిం బరిగణించదు దైవము భూతిమంతుడై

నా భర్త యొక్కడున్నాఁ డన్నగారితో
బాటు జటాధారి పట్టణమున
నతని భార్యను నేన, యపకీర్తి పాలైన
యత్తగారును సుఖమతిన నేను

కుమిలిపోవుచు నాదుకొం చుంటి మొక రొక
రీ మాత్ర వాసంతి యెదిగెనేని
ఆ యత్తగారు దయాక్షీర పాథోధి
శ్రీమతి యామమ చేతి చలువ
సుకృతి పరిణామ భూత యా శుద్ధశీల''
యనిన యంతన భరతుని యాంతరమున
రామ కీర్తి పతాకాభిరామ యష్టి
మూర్తి తన తల్లి కైకేయి మూర్తి కబ్టె

మృదుపక్ష్మ నత కేసరార్ద్రి నయనోర్మిలంబుగా మాండవీ
సుదతీ భర్త వంచించె నీ పగిది ''రక్షోరాట్పరోక్షారి స
త్పదముల్ చేరి క్షమింప వేడెదన. ఈ వాసంతియున్ విచ్చునే
కద తానప్పటి'' కంచు నేగె విధుతాఘప్రక్రియాంబానుతిన్.

ఆ సాయంతటిఁ గైకయీ పద సపర్యాధుర్యుడై వచ్చుచున్
వాసంతీ లత చిన్ని పూవిదిలు శోభం గాంచె రామనుజుం
డా సీమంత మధూళికా రచిత నూత్నారుణ్య కాశ్మీర రే
ఖా సంపన్నిధి మాండవీ ముఖ లసత్కంజాత సంజాతమున్.

ప్రేయసీ కుచపార్శ్వ పిహితాతిముక్త సు
మాంశు కాంచల పరిమళ లవమ్ము
నింబసూన కషాయ నీహార వాసనా
భర నవ ప్రాభాతవాయువీచి

నవతాప పరిణామ దివసాపరార్ధ సూ
ర్యాతపానీత ఘర్మాంబు క్లప్తి
పట్టాభిషేక వేళాట్టహాసాననాం
భోజార్ద్రి మాండవీ ముఖ దిదృక్ష

కదలుచుండిన వాయురేఖలుగ వచ్చి
కలువసేపిరి చేఁబూని కడ నిలచిన
భరత పతిభావమయమైన పాల్కడలి క
రళ్ళుగాఁ బొంగివచ్చె శ్రీరామ నవమి.

— విశ్వనాథ

## పల్లకీ

ప్రాణ సఖుడె నా కోసమై పంపినాడు
పల్లకీ అన హృదయమ్ము జల్లుమనియె;
వీడని వియోగమున వేగు మోడుమేను
తలిరు తోరణమై సుమదామ మాయె!

చెదరు చేతుల నెటొ కయిసేసుకొంటి
మొయిలు వసనమ్ములో ప్రొద్దుపొడుపు నగలొ,
ఏదొ కాలుచు హాయియో - ఏదొ తేల్చు
భారమో యేమొ సైరింప నేరనైతి!

కొసరు నడల తూగాడుచు కూరుచుంటి
పూల పల్లకిలో పూలమాల నేను !
" ఓ " యనగ, " నోహాహో " యన బోయవాండ్రు
దారిబడి నిల్చి చూచె. నూరూరు నాడు !

" ఓ " యనగ, " నోహాహో " యన బోయవాండ్రు
వీటి వెలుపల మేల్కొనె తోట తెరువు !
" ఓ " యనగ " నోహాహో " యన బోయవాండ్రు
తోట పొలిమేర కాలువ తొనకె నిదుర !

ప్రణయ వల్లకి పల్లకీ ! ప్రసవభర వ
సంత వల్లిక పల్లకీ ! శక్రచాప
వక్రరేఖ పల్లకీ ! మధుస్వప్నశాఖ
పల్లకీ !

— కృష్ణశాస్త్రి

## సౌందర్య లహరి

తనుమధ్య క్వణ కింకిణీ రశన మాద్యత్కుంభి కుంభోపమ
స్తనభారా నత దేహవల్లిక, శరద్రాకా శశాంకాస్యయై
ధనువున్ దూపులు పాశ మంకుశము నుద్యత్పాణులం దాల్చి మా
కనువిందై పురదాహకాహ మికయా కళ్యాణి మమ్మేలుతన్ !

చక్కెర విల్లు, వింటికిని షట్పద శింజిని యంట ! తూపులన్
లెక్కకు నైదు టామనియె నెయ్యుడుగా, వలినాలి గాలి తే
రెక్కి యనంగు డెక్కటి జయించెడు నంట జగమ్ము లేదయా
దృక్కిరణమ్ము సుంత ప్రసరించెనొ నీ కడకంట వానిపై !

* * * *

కరముల పుస్తకమ్ము, స్ఫటికమ్ముల పేరు, వరాభయమ్ములన్
వరల, శశాంక కోరక విభాసి జటాముకుటమ్ముతో శరత్
స్ఫురదభిరామ చంద్రికనుబోని నినుం గనుగోని వారికిన్
దొరలునె గోస్తనీరస మధుద్రవతుల్య వచః ప్రసారముల్

వరదాభీతిద పుస్తక స్ఫటిక మాలాపాణివై, పూప చం
దురునిం జెర్వినమౌళి చెల్వున శరజ్జ్యోత్స్నారుచిన్ వెల్గు ని
న్నరయన్ నేరని వారి కెట్లొదవు జిహ్వాగ్రమ్మునన్ గోస్తనీ
సరసమ్ముల్ మధుబిందు పాయస వచః స్యందమ్ము లందమ్ములై

సరస కవీంద్ర హృత్కమలషండ నవాతపరోచి వైన ని
న్నరుణను గొల్వ కెట్లొదవు నంబరొ! పల్కుల కల్కి పూప ని
బ్బరపు మిటారపు న్వలపు వాకల లోతుల కించుమించులౌ
పరువపు పొందులన్ రసికపాళికి విందులు వెట్టు నేరుపుల్ ?

* * * *

మను మి న్నేకముగా దిగంతరమునన్ బంగారు నీరూదు నూ
తన సూర్యద్యుతిఁబోని నీ తనురుచిన్ ధ్యానింపగా నేర్చినన్
దనకున్ మేల్పడి భీత భీత మృగనేత్రల్, మేనకాద్యప్సరో౦
గన లెల్లన్ బడికాపులుంద్రు పడకింటన్ గొల్చి కన్సన్నలన్.

— కాటూరి వెంకటేశ్వరరావు

## ముసి పుట్టిన గాథ

[ముసి ఒక సెలయేరు. అది పుట్టినది వెలిగొండలలో]

వెలిగొండ లవియు శేషా
చల పుచ్ఛాకార శైల సంతతి తనపై
నిలిచిన దేవుని బరువున
కలగొని తలలెల్ల చాపకట్టు వడంగన్

ఉరగుల రేని కొండ తలయూపిరి తోకకు వచ్చి బాధతో
గురుతులు తప్పినట్లు వెలిగొండలు నల్లలనాడ నందు సు
స్థిరుడయి శ్రీపతిన్ మదిని జేర్చి తపమ్మొనరించు దేవతా
గురునిభుడైన మౌని ముచికుందుని ధ్యానసమాధి భగ్నమై

ఓ నా హృత్కమలాధి దైవతమ ! నీ యుద్యోగ మేమయ్య! కా
లూనన్ శేషగిరీంద్ర మస్తకమునం దూటాడి పుచ్ఛాకృతి
శ్రీ నాగావళి యిట్టు లొడ్డగెడవై జృంభించునా యేమి స
ర్వానర్థమ్ములు ధాత్రి నంచును సతం డాక్రందముం జేసినన్

అచ్చపు మునీశ్వరుడ వీ
వచ్చట నుండ నికనేమి యను ధైర్యముతో
నిచ్చట కాలూనితి నో
సచ్చరితుడ ! యంచు స్వామి సన్నగ నవ్వెన్

ఒంటిగా పురి వెడలి యాలము నొల్ల కూరక వోవు నా
కొంచె కృష్ణుని వెన్ను దన్నిన కోపనుడు తను దన్నగా
కంటి చూపున నీ రొనర్చిన కాలయవనునినాటి ము
క్కంటితనపు టహంత తలపున కదలి యా వెడనవ్వునన్

నా భావమ్మున నాటి జీర కరుణన్ మన్నింపవే సూక్ష్మ శి
క్షా భూజాని ! పయః పయోధి మథన క్ష్మాభృత్సముద్ధారకా !
నీ భారమ్మున కేను తూకమటవే నీవున్ ద్వివాభాగమై
యీ భాగమ్మున గూడ కాలిడిననే యీ క్షోభ చల్లారెడున్

అని వేడన్ ముచికుందు డవ్యయ కృపా వ్యాపార పారీణతా
ఖని యా దేవుడు నారసింహ మహితాకారమ్ముతో వచ్చి గొ
బ్బున వ్రాలెన్ వెలిగొండ కొమ్ముపయి దిగ్భూమీ నభోభాగ వ
ర్తన తన్మూర్తి సమిద్ధ తేజము ధరారక్షానురక్తమ్ముగాన్

వెలిగొండ్రాయడు కాగ నిట్లు విభుడున్ వే తత్ప్రతిష్ఠా మహా
ఫల భాగ్యోదయుడై తరించె ముని తద్భారానతాంగమ్ములై
వెలిగొండల్ కలగుండు మాని స్థిరతా విశ్రాంతిమై నిల్వగా
తల లెత్తన్ బరువేది శేషగిరి శ్రీధామ ప్రభాధామమై

వెలగొండదేవు నభిషవ
సలిలము శ్రీవిష్ణుపాద సంభవ గంగా
జల సమధిక వైభవమై
సెలయేరై ధరకు చెంగు చెంగున దూకెన్

ముచికుందుని పేరట నది
ముచియై జనవాక్యమందు ముసియై శుచిమ
ద్రుచిమద్రస సంభార
ప్రచార సాహిత్య నిత్య భండార మగున్,

— నాయని సుబ్బారావు.

## కలకాలం

ఔను వాహనం మారింది : దూరానికి పూర్వపు టర్థం పోయింది.
పూర్వం దూరం పోయింది, వెనకటి వాహనం మారింది
ఆ సూర్యుడే నేడూ
ఆ చంద్రుడే నాడు
అవే నక్షత్రాలూ, ఐనా కాలం మారింది.

ఔనా, కాలం మారింది మరి: మానవుడా మేలుకో, నేస్తం
ఎద్దు బండితో కొలవకు దూరాన్ని. ఎగరవోయ్ చదలయెద చీలుస్తూ-
రేపు బయల్దేరాలనుకున్నావు
నేడే ఇచ్చటికి వచ్చేశావు
విచ్చేసింది నీ తరుణం ! పుచ్చుకో ఇది నీ భావి

ఇది నీ భావి: గ్రహించు ఈ భావి నీకు నా ప్రెజెంటు
భూతకాలపు సరీసృపాలని పాత రాతియుగంలో పారెయ్
పాతెయ్ నీ సందేహాలని
తోలెయ్ నీ మందాక్షాలని

నిటారుగా నిలబడు నేస్తం ! హుటాహుటిగా ముందుకి సాగు
హుషారుగా ముందుకి సాగు: ఊరికే వెనక్కి చూస్తావేం
దుప్పివీ కుక్కవీ కావు, తిర్యగ్మృకుక్కవి నువ్వు కావు
దూరం కరిగిపోతోంది
కాలం మరిగిపోతోంది
మానవుడిగా మేలుకో నేస్తం! ఏలుకో ఈ విశ్వం సమస్తం.

— శ్రీశ్రీ

## స్వయంవర

వాడవె నాదు స్వామి! తెలివాలు కనుంగవ రత్న దీపముల్
నీడల నీలిమం గదలు నిగ్గుల నిద్దపు తీవి దోచు, ఊ
గాడు కిరీటపుం గొనసల కట్టిన కుచ్చుల మంచి ముత్యముల్
చూడవె! శైలసానువుల సుందర వారిద చంచలాకృతిన్

నా సుకుమారపు న్నెడద నాటిన దీతడె సుమ్మి! మాలతీ
హాస మరీచి, మల్లియల యౌవనపు న్ననుసిగ్గు, ఏలకీ
వాసిత చిత్ర సౌరభము, పండిన సంపగి తావి మైకమున్
ధూసర మయ్యెనే వలపు తోరపు పుప్పొడి జల్లువెల్లువన్ ?

ఏ రమణీయ సంధ్య రచియించితినోయి కపోల తల్ప మం
దార సుధాత్రపల్; అవియె దాసినిగా యుపదల్ గ్రహింపు మ
య్యా రఘుచంద్ర! యీ వలపు లంటిన లేత వయస్సులో మ రే
తీరున నీయుదాన గురుతింపగ నీవు మదార్ద్ర చిత్తమున్

తొలితొలి జన్మలందు దయతో కలలో కనుపించి, కన్నులన్
వెలుగుల నింపి, చేత చెయివైచియు ప్రేముడి మీరు బాసలన్
పలికినవాడు నేడిటుల వచ్చెను గాక యథార్థమై, మ రీ
పులకలు ఏమె నా తనువు ముంచును స్వర్గము దాక సాగుచున్!

ఇతడటే పుత్రకామేష్టి యాగఫలమ్ము
దశరథానంద నందన వనమ్ము!
ఇతడటే వెరపేది యింత వయసున రా
క్షసుల దున్మిన వాడి కత్తి మెరపు!
ఇతడటే రఘువంశ తతకీర్తిమద్గుణ
సంపదల్ ప్రోవైన చారుశీలి!
ఇతడటే సాకేత నుత యౌవత వనమ్ము
కన్నట్టి నెత్తావి కలల గుత్తి!

ఇతడటే తండ్రి నన్ను నాగేటిచాలు
కదిపి వెలికి తీయక ముందె కానుపించె
నేమొ గాక, లేక జననమేల నాకు
స్వామి కోసము గాక నే నేమి కొరకు ?

అతడు వచ్చెనా లేదా అల్ల పందిళ్ళ న
గ్గడల పద్మాల తోరణలు విరిసె ;
అడుగు కదిపినంత హల్లకమ్ములు పూచి
సభ నెల్ల సౌందర్య సరసి జేసె;
పెదవి చిర్నగవు తుంపెసలాడ మల్లె మొ
గ్గల వాన జల్లుజల్లులుగ కురిసె;
వాని కన్నంత నాలోని గుబ్బెల్ల బ
యలు పడి పసపు సిగ్గులను చిమ్మె ;

ఇది వలపొ ! జన్మజన్మాల నడుము సౌహృ
దమ్మొ ! లోని ఆత్మల పిల్పొ ! దాచుకొన్న
పుణ్యమో ! దోచుకున్న స్వర్భోగమో ! ప
విత్ర మీ క్షణ మీ స్వామి వీక్షణమున

వీని చెంతజేరి విడువగలను నేను
సుఖము లేని రాణి సొగసు లేని;
వీని పసుపు చాలు వెడలగలను నేను
అడవి కేని కడలి నడిమికేని

ఏలా రెప్పలు సంచలించు ? వలపుల్ ఇంతేసి చిత్రమ్ముల
నా ? లేకన్ కనుగప్పు మాంత్రికములా ? నాలోన లోలో నెదో
వేలా విస్తృత తంత్రులం గదలు; రావే నెచ్చెలీ ! స్వామి నా
పై లీలన్ పరపించె చూపులవి రవ్వల్ రువ్వ పారీణతన్

అదిగో సాగెను స్వామి విల్లుకయి, ఆ అందమ్ము ప్రాతస్సర
స్పదనోద్దీపిత రాజహంసవలె, ఆశాంతమ్ము శోభించు, కన్
తుదలన్ చూడవె! లౌకికావధుల నాందోళించు క్రొవ్వెల్గు సం
పద లోహో చెలి! అతడే అతడె నా ప్రాణేశు డాజన్మమున్

తాకిన విల్లు తాకినటు దాశరథి ప్రథితాంగుళీయక
శ్రీ కిరణాప్తిచే విరిగె చిత్రము నెచ్చెలి నిక్వణ క్వణా
వ్యాకులమై ధనుస్సు – ఇటు వంగిన నాయెద వింటితోడ కే
కీ కలహంసికా పికశుకీ రమణీయ సకాకలీ ధ్వనిన్

హ్లాద హహాహహన్ దివిని అప్సరలేమొ నటించి పుష్ప వ
ర్షాదర మిత్తురీ విధము; రా, చెలి! క్రమ్మెను మైకమేదో, యీ
మోదము దేహమందు నొక మూర్ఛనగా శ్రుతివేయు; రమ్ము, స
న్నాదుము – పూలమాల నెటులంతట వైతును నాదు స్వామికిన్

చాలదు లేవె నా యెడద స్వామి మనోజ్ఞతలన్ గ్రహింప నే
తాళగలేను నా బ్రదుకు తాకిన మోద శతారభార మా
కేలను పట్టుకొన్న కటి గీర్చిన రత్నపు కట్టులోని హుం
దా లొలయించు వాడి మొహ్దా కొసలే మెరసెన్ మనస్సులో.

— తిలక్

ఉగాది : కాలం

ఎందులోంచి ఎప్పుడు ఎలాగ పుట్టింది కాలం ?
ఎవరివల్ల, ఎవరికోసం జరిగిం దీ ఇంద్రజాలం ?
ఏది దాని తల్లివేరు ఎలా మూసుకొంటుం దీ పెద్దనోరు
ఏమిటి దీని భాష, ఏమిటి దీని శబ్ద సముద్రఘోష
ఏమి టీ కాలం ? ఏమిటి దాని పారిభాషిక పదజాలం ?

ఏ తొలివేకువ ఉలిపొర వెలుతురులో
అలసిపోయిన ఆలోచన మోస్తరుగా
రంగు వెలిసిన ఏ వేగుజుక్క మాదిరిగా
ఆదివేదం గొంతుకెత్తి కోడికూత కూసినప్పుడు
మేల్కొన్న మానవజాతి మేల్కొన్న మానవజాతినే
మేల్కొలిపినప్పుడు – ఎప్పుడా అప్పుడు ?
ఎలాగో పుట్టిందా ఈ కాలం
ఆ కాలానికి పుట్టిందా కాలమానం

తనకు తానై పుట్టి అంత మే లేనట్టి
నిరంతర కాలానికి నిర్వచనం ఏమిటి ?
ఆదిలో ఏముంది ? అంతా శూన్యం
శూన్యం నిద్రలో సూర్యుడు కలలాగ పుట్టాడు

ఆ కూర్కు బహుశా కాలం కావచ్చు
దాని మారుపేరు క్వొశ్చన్ మార్కు
అది సురాసుర మానవుల పబ్లిక్ పార్కు.

శూన్యంలోంచి సూర్యుడు పుట్టి
సూర్యుడితో కాలం పుడితే
కాలంయొక్క జనన కాలం గుణించండి
లెక్కపెట్టలేని సంవత్సరాలు లెక్కపెట్టండి
పాల సముద్రంలోనే పాలిచ్చే కామధేనువు పుట్టినట్టు
కాల సముద్రంలోనే కనబడే కాలం పుట్టిందా ?

కాలస్వరూపం విరికాదు ఆవిరి
కాల రహస్యం పురికాదు ఊపిరి
మానవుడి నిట్టూర్పుకి ఓదార్పు
మార్పుల కూర్పు మనకు చేతకాని నేర్పు
సర్వలోకైకనాథుని చేతిలో మూడు తీగెల హార్టు
ప్రప్రథమ నామవాచకం, ప్రాణానికి సర్వనామం
ఒకే ఒక్క అసమాపక క్రియ మృత్యువుకి పర్యాయపదం
వేదాంతికి ఆప్త మిత్రుడు విజ్ఞానానికి గర్భ శత్రువు
సామాన్యుడి మార్గదర్శి లోకానికి సూర్యరశ్మి
కాలం మన ఆశల ప్రశ్నలకి జవాబు
కాలం మన ఆశయాలకి పెద్ద సవాలు.

సమిష్టి జీవన సైకత•స్థలాన
వ్యష్టి జీవితం ఒక్క రేణువు కావచ్చు గాని
వ్యక్తిగతంగా ప్రతి వ్యక్తికాలం
ఆ వ్యక్తి తొలి ఊపిరి పీల్పుతో మొదలై
కడసారి కంటిరెప్పతో అంతమౌతుంది.

అంత మాత్రాన అంతకు ముందు అతడి కాలం లేదా ?
మాతృ గర్భాన యోగ నిద్రలో తలక్రిందులా
పది మాసాలు చేసే తపస్సు యొక్క
పారమార్థిక వయస్సెంత ?
అదికూడా ఆ వ్యక్తియొక్క వ్యక్తిగత కాలం కాదా ?

అంతకుముందు ఆ గర్భాన పడడానికి పూర్వం
తండ్రి మనసులో తలంపుగా
తమస్సులో మెరపుగా
అతడి తపస్సుకి చరమ వరంలాగ
చర్మంలో కోర్కెలాగ శరీరం నిండా నిండి
అతడి కామంలో కవాటాలు తెరచుకొని
ఆకారం ఏర్పరచు కొనడానికి
అవకాశం ఏర్పరచు కొన్నప్పుడే
ఏ వ్యక్తి జీవితకాలమైనా
తనకు తాను శ్రీరామ చుట్టుకొంటుంది

తండ్రితోనే కాదు తాతతోనే కాదు
ముత్తాతల మూలపురుషుడి కాలంతో
ఆదిమానవుడు ఆవిర్భవించిన తొలిపొద్దులలోనే
ప్రతివ్యక్తి జీవితం చిట్టాలో
తొలి పద్దులో కాలం పడ్డదన్నమాట

గారడీవాడి గమ్మతుల
పెట్టెలోఉన్న పెట్టెలోఉన్న పెట్టెలాగ
తానున్న కాలంలోనే రానున్న కాలంలోనే
జరిగిపోయిన జరుగుతున్న కాలా లున్నవి.

ఆ గారడీవాడు తన నోట్లోంచి లాగుతున్న
రకరకాల రంగురంగుల ఏకాండీ దారంలాగా
గాభరాపెట్టే గంభీరమైన విచిత్రం కాలం
గారడీ వాడెవరు ? ఆరడి చేస్తాడెందుకు ? ఎందులోంచి

ఊహ వెళ్లినంత మేర ఉంటుంది కాలం
ఊహలనీ ఉసురినీ తింటుంది కాలం
అది మానవ మత్స్యానికై వేసింది గాలం
మానవుడు దానిపై దూసె కరవాలం

జీవితం తిరునాళ్ళలో ఖర్చు పెట్టుకోమని
పెదనాన్నగారు ఇచ్చిన చిల్లర డబ్బులు కాలం
చరాచర జీవకోటి శ్రీమంతులైన బంధువర్గం
మానవుడు మనవడి కిచ్చిన వారసత్వం కాలం

కాలజ్ఞాన రహస్యం తెలుసుకొందికి
కావ్యాలు చదివాను, చదివాను తత్త్వం
కర్మయోగులను దర్శించాను, చేశాను తపం
ఎత్తులకు ఎగిరాను లోతులు శోధించాను
విఖ్యాత విచిత్రకారుడు సర్వదార్ దాలీ
వేసిన ఆరవేసిన గడియారాలలో
చక్రం పళ్లలో చిక్కుకొన్న కాలం
నన్ను బెదిరించింది కావ్యాలు నన్ను మరపించాయి
తత్త్వం తలకెక్కింది తపస్సు బెడిసికొట్టింది.

కాలం ఒక తేలని ప్రశ్న
కాలం ఒక తీరని తృష్ణ
విరామంలేదు విజ్ఞానికి
సందేహం తీరదు వేదాంతికి
ఓటమి ఇసుక తిన్నెలలోనే ఓర్చుకొని
జిజ్ఞాస కారు తోలుతాడు మానవుడు
గండాల సుడిగుండాలలోనే ధైర్యంతో
పరిశోధనలు స్టీమరు నడుపుతాడు మానవుడు
ప్రాణాలు పెట్రోలుగా పోస్తాడు
కాలానికి ఎదురీదుతాడు.

యోపాం పుష్పవేద యోపాం వేదంవేద అతడికి
శపిస్తున్న కాలం శాంతిస్తుంది

శతిస్తున్న కాలం లొంగుతుంది
ధార్మిక తరంగాలలో ధన ఋణ పక్షాలలో
పరమాణు శస్త్రాలతో పరిశోధన సత్యాలతో
స్పీడును జయిస్తున్నాను స్పేసుని సాధిస్తున్నాను
మేధా శోధననాళికలో కాలాన్ని పోసి
మండుతున్న గుండెలమీద మరగ పెడతాను
మానవాళికి పనికొచ్చే ఫలితాలకోసం
పాటుపడతాను, పాటుపడతాను.

ఊహకందని ఊహల కీకారణ్యంలో
కాలాన్ని పట్టితెచ్చి రాటకేసి కట్టేస్తాను
మచ్చికచేసి మన రథానికి కట్టేస్తాను
గడచిపోయిన కాలంలో కరిగిపోయిన క్షణాలు
గడ్డకట్టేటట్టు చేస్తాను దాన్ని పట్టుకొస్తాను
రానున్న కాలంలో దాగున్న విషఘడియల గుండియలు
విజ్ఞాన శాస్త్రాలతో తుత్తునియలు చేసి
వాటివల్ల ప్రమాదం వాటిల్లకుండా చేస్తాను
వంకరటింకరగా పోయే వర్ధమాన కాలపథంలో
కష్టాల కంకరరాళ్లు లేకుండా చూస్తాను
కాలాన్ని మీకు బానిసగా చేస్తాను
కళ్లల్లో జ్యోతులు వెలిగిస్తాను
భూతల స్వర్గానికి తలుపులు తీస్తాను.

— ఆరుద్ర

## శిశిర ప్రభాతము

మునిపల్లెన్ శివరాత్రి వచ్చె నని సమ్మోదమ్మునన్ వేగుబో
కనె దర్భాస్తరణమ్ములన్ నిదుర మైకమ్ముల్ వీడిపో లేచి, వా
మన దేవ స్తవముల్ పఠించి నిఖిలామ్నాయ ప్రపంచాత్మ ద
ర్శన పారీణ మహర్షు లుత్సుకత నిర్వర్తించి రయ్యె విధుల్

అమృతాంశుం డుదయించువేళ, సితనీహారావృతాభన్ బ్రపం
చము సర్వ మ్మరవిచ్చు వెన్నెల ధరాస్వప్నమ్ముగా జేయు మా
ఘ మహాశ్రీ శివరాత్రి వేకువ రుదుం గాలాహుతి ప్రీణితా
గ్నిముఖుం బువ్వులు దేర నా ప్రమతి పంచన్ గానకున్ బోవగన్

గరిడియ కేలబూని, యొడికమ్ముగ ముంగురు లెల్ల మల్లె పూ
సరమున జుట్టి, కృష్ణమృగచర్మము పైవలెవాటుగా మనో
హర వసనమ్ము మేన మెరయన్ రురుడుం దుహినార్ద్ర శాద్వలాం
తరమున నాకుపచ్చని పదమ్ముల చిన్నె లమర్చుచుం జనెన్

దూరమునీశవాటి యెదదోచె హిమాభన దృశ్య దృశ్య రే
ఖా రమణీయమై; విధువికస్వరమై వెలిగెం జగమ్ము ని
ద్రారభమాణమైన కలయై. విలయోన్ముఖ ధాతృభావనా
కారమునందె నిల్చిన యొకానొక నూత్న జగన్మనోజ్ఞమై

ఇరుగడలం బచేళిమ మహీరుహాపర్ణము లోలింపిల్ల తె
మ్మెరలకు దూలి, బాల రజనీశ్వర కాంతుల దళ్కుదళ్కునన్
మెరయుచు మర్మరస్వనము మీర భువిం బడ గాననేందిరా
చరణరవమ్ములుం జెరగు సవ్వడులున్ మొరసెన్ రురుశ్రుతిన్

మౌనికుమారపాళి చలిమంటల వెల్గుల గంకణాకృతిం
బోని విధాన జేరి, చలివో సమిధల్ గదలింప, వహ్ని శో
భా నివహమ్ము వారి కనుపాపల దూకుచు మేలుకొల్పె వ
క్కానన భూరుహమ్ముల సుకమ్ముగ గూర్కు నెమళ్ల యందమున్

శైశిర వారిసిక్త తరుశాఖల సుప్తవిహంగజాల మా
కాశ పథమ్ము గాంచి, యొరకల్ విదిలించిన యంత జంద్రికా
పేశల రశ్మి సోకి హిమ బిందువు లొక్కట హీరహార సం
కాశములై వనింబడ వికావికలై చెదరెన్ మిణుంగురుల్

వెన్నెల చిన్నిజాలు లడవిం బడి, పచ్చిక సాలెగూడులం
బ్రన్నని మంచుముత్తెపు హారంగుల గూరికె ; గొండకోనలో
సన్నని యేటికాల్వ నునుసవ్వడి యవ్వని దాళ్ళహారులం
గన్నులు మూసి మ్రాన్పడిన కైవడి దోచె నెలుం గడంగగన్

విచలిత శాఖలన్ నివరి వెన్నులకై పరువెత్తు తల్లికిన్
గిచకిచలాడి, యేదొ యెరిగింప బయల్పడి, బాలకీర మా
రిచె దరుసీడమంటి, చివురించిన మావుల జిన్నపూవు గూ
రిచి శరమేయ నారి సవరించె మరుం డళి నిస్వనమ్ములన్

అవనిరుహమ్ము వెల్వడి, విహాయసవీథికి బోవ మేనికిం
బవనపథమ్ములం దెగుర బ్రాయము సాలమి మావిరెమ్మకుం
దవిలిన రెక్క లార్చుచు బదమ్ముల దొట్రిలు కోయిల మ్మెటో
కువకువ లాడుగాని మరి కోయన నేర దెదల్ చివుర్పగన్

గలగల పారు కొండదరి కాలువ వాలిన గేదగిన్ బరీ
మళ శయితాహి యా రురుకుమార పదశ్రుతి మేలుకొంచి, నా
ల్కలు నులివెన్నెలన్ మెరయ గ్రమపదాహతి నాచి బుస్సనన్
జెలగె రురుండు తన్మృదుల శీర్షమణి స్ఫురదిందుమూర్తికిన్

ఆ శుచితారా విశ దా
కాశము మణిమౌక్తిక ప్రకాశమ్మకుట
మ్మై, శిశిర శ్రీమౌళి వి
కాసించె సరోవరాంబకమ్ముల వెలుగై !

— గణపతిశాస్త్రి

నాకొకించెం నమ్మక మివ్వు !

నాకొకించెం నమ్మక మివ్వు !
కొండలు పిండి కొట్టేస్తాను
చితికిన టొమేటోలాంటి సూర్యుణ్ణి

ఆరిన అప్పడంలాంటి చంద్రుణ్ణి
ఆకాశపు ఎంగిలి పళ్ళెంలోంచి నెట్టేస్తాను
నాదగు బాహు బంధనంలో ఈ సువిశాల బ్రహ్మాండాన్ని
చాపలాగ చుట్టేస్తాను
నిస్పృహాయ మానవేయుని నొసటిరాలు
ఒక్క కలంపోటుతోడ కొట్టేస్తాను
జీవిత సభా భవనంనుంచి
అన్యాయాన్ని దౌర్జన్యాన్ని మెడబట్టుక గెంటేస్తాను
ఇంకెన్నో ఎన్నెన్నో చేస్తాను, కాని ఒక్కటి—
నాక్కావంచెం నమ్మక మివ్వు !

•

కాలునిమీద కలబడతాను
పరమశివుని శూలాగ్రాన తలక్రిందుగ నిలబడతాను
ఇంటింటా గగనకుసుమాలు మూడు పూవులుగ
నందన నికుంజాల్లోని అమృత ఫలాలు ఆరు కాయలుగ
పూయిస్తాను, కాయిస్తాను
కొయ్య తుపాకి దొంగనై పోయి
బావులు పూడ్పిస్తాను, చెరువులు త్రవ్విస్తాను
ఆకాశపు పందిరిక్రింద
నయాగరా నిర్ఝరాల చలివేంద్రాలు స్థాపిస్తాను
ప్రపంచమనే మహాసత్రం నిండిపోతే
మరో సత్రం కట్టిస్తాను
ఆకాశపు ఉదారంగు తాను చించి

చొక్కాల్లేని వారందరికీ కుట్టిస్తాను
ఒకటేమిటి ఏదైనా చేసేస్తాను
నాకొకంచెం నమ్మక మివ్వు!

నమ్మకంలేని బొందె ఖాళీ సిగరెట్టు టిన్ను
నమ్మకంలేని హృదయం పుల్లలులేని అగ్గిపెట్టె
నమ్మకంలేని బ్రతుకు కాలిన సిగరెట్టు బూది
అన్నీ ఉన్నప్పటికీ నమ్మకమొకటి లేనియెడల బ్రతుకు వమ్మే
నాకొకంచెం నమ్మక మివ్వు! నమ్మక మివ్వు! నమ్మక మివ్వు!

— బైరాగి

## నదీలక్ష్మి

లీల హరివిల్లు రంగుల పూల జడయు
చిలుకరెక్కల మెఱుంగు దువ్వలువ దాల్చి
మొగలి పువ్వొళ్ల మెయి బుగబుగలతోడ
ఎవరు వచ్చిరె మన తెనుగింటి కడకు?

తరుణేంద్రగోప లాక్షా
చరణాంకిత శోభ వెలుగ శాద్వల భువి యె

వ్వ రహో శ్రావణ లక్ష్మియె ?
వరలక్ష్మియె ? తెనుగువారి వాకిట నిలిచెన్

ఇదియేమి గ్రీష్మాగ్ని నెగయు మంటల క్రాగి
గగనమ్ము కరిగి వాక యగునేమొ
తరణి ఖరాంశు సంతప్త లోకము గాంచి
గిరిరాజునెద పొంగి పొరలెనేమొ
ప్రావృణ్ణిషాదుండు వారిద మధుకోశ
మొడిసి పిండిన తేనెమడుగు లేమొ
ఏ మిది ఇలువేల్పులౌ మహాదేవుల
కరుణామృతము కాల్వ గట్టెనేమొ
అనగ జలలుగ నెలలుగా నవతరించి
వనరి దాహాన బీటలువారు నఖిల
భూమి హృదయమ్ములు రసార్ద్రముల నొనర్చి
ఏగుదెంచె వర్షా సరిద్రాగమూర్తి ......

చండశాసనుడు మార్తాండరాజు మహోగ్ర
శాసనావళి కింకస్వస్తి చెప్పి
నాల్క తడుపగలేని నగరప్రజాళికం
గొనరు దీనతకు వీడ్కోలు పలికి
ఊరించి ఊరించి నీర మిచ్చెడి పల్లె
చెలమ లోభిత్వమ్ము తొలగ బెట్టి
మొగమంత ఒక్క చూపుగ తొంగి వీక్షించు
పేదకర్షకుని నవ్వించి మించి

ధనువు తనువంత రాగమ్ము తొనుక వరద
హస్తభంగుల సర్వాల కభయ మిచ్చి
ఏ మహీధరు శుద్ధాంతసీమ వెడలి
దేవివోలె వచ్చినది నదీమతల్లి .........

పడమటి సంజ క్రొంబసిడి పావడదాల్చి దినేశ కుంకుమం
బిడి నుదుటన్, కపోలముల నించుక పుప్పొడు లద్ది తీర్చి కీ
ల్జడ సుమ వల్లులం దురిమి శ్రావణ సంధ్యను పేరటమ్ముకై
వడి నడ తెంచె నొక్కొ నవవార్షుక వాహిని మోహనాకృతిన్

ఊగిన గుండెలో అమృత మూరగ నిల్చిన దా రసాకృతిన్
సాగుచు నాలుకా మృదుల శయ్యల వ్రాలుచు, వక్రయాన లీ
లా గతి ఫేన పుష్ప సమలంకృతి క్రొందరగల్ ధ్వనింప వ
ర్షాగత సుందరాపగ మహాకవి కావ్యము వోలె శోభిలున్ ...

— ఇంద్రగంటి

## అచుంబితం

మాట్లాడని మల్లెమొగ్గ
మాదిరిగా నడచి రా
నిశ్శబ్దం ఎరుగనట్టి
    నిమ్నగవలె నడచి పో

చేదగు కన్నీటి బొట్లు
చిందిన చప్పుడులు విను
వాదింపగరాని మనసు
    పరివాదిని లోతు కను

మూగిపుస్తకాలలోని
రాగాలను పాడుకో
గాలివోలె కనుపించే
    ఆలోచన వాడుకో

కడుపులోని దుఃఖంవలె
కరశ్చైత్తి పడెడు కడలి,
పచ్చని లోకమును చెరప
    వచ్చెడి శైశిర పిశాచి

వెదురు పొదలలో చొరబడి
రొద లిడు మలుసందె
గాలికంటె తేలికగా
కదిలెడు కవి మనసు జాలి

భీముని గదలా బరువై
భీతిగూర్చు ఋషిశాపం
రాముని బాణాని కంటె
ప్రబలమైన జనకోపం

ఆకులేని మోదుగుపై
కాకలెత్తు పూమంటలు,
ఎరువులేక నీరులేక
ఎగసి వచ్చు ఎద పంటలు

మనసుకె కనరాన్ని రూపు
మాటకు వినరాని ధ్వని
తలకందని క్రొవ్వాసన
బుద్ధి కందనట్టి యెత్తు

ఆలోచన లంత లేత
వైన అంగుళుల కొసలు
స్పర్శింపగలే నంతటి
పలుచని అర్థాల ఒడలు

కోర్కెలు చుంబించలేని
కోమలి ఆశల పెదవులు
గగనము మాత్రమె దర్శిం
  చగల విశాల మనస్సులు

ఉగాదిలో దీపావళి
కాముడిపున్నమకు వాన
భాద్రపద మహాంధకార
  పథములలో చిలుక పిలుపు

రత్నాల్లో నాల్గు రాళ్ళ
మ్రోళ్ళ బ్రతుకు బాటలందు,
అప్పు డప్పు డవి పూయుట
  మరల అంతలో మాయుట

తలలు వాల్చియున్న జనం
గళాలెత్తి పాడుట,
కదలలేని ఎద నెమళ్ళ
  కండ్లు విప్పి ఆడుట

మట్టి ఆకుపై విష్ణువు
మాదిరి శబ్దమున శక్తి,
సముద్రాన పాలవోలె
  సరిగమలో సంగీతం

మనకున్న నిఘంటువులు
విననట్టిది కననట్టిది
నది తరగలలో, భావుకు
మదిలోపలి వింత పలుకు

మెట్లులేని మేడ మీద
మేలి నీలి ముసుగు తీసి
నవ్వే అందాల తరుణి
నవశారద నిశాశశి

ముసలి భాస్కరుని చూపుల
మసకలలో తప్పిపోయి
కనుపించిన కాలాంశం
కవిచూపుల కనుపించుట

అర్థమగునె సగం సగం ?
అచుంచితం మనోజగం
అందుకోరకె కలం ముక్కు
నందు సందు చేసుకో

పవళించుము నీలో నీ
వెవరిని మేల్కొల్పబోకు
విచ్చిన ఎదకంటి చూపు
విశాలమై క్రమ్మనీ.

— దాశరథి

## శైష్యోపాధ్యాయిక

సువిశాల దీర్ఘ విస్ఫూర్తి నేత్రములకుఁ
జూపులో సూక్ష్మ సూక్ష్మ గతులు
వజ్ర కాఠిన్యమ్ము వక్షస్థలమ్మునఁ
జిత్తమ్ములోఁ బువ్వు మెత్తఁదనము
విగ్రహమ్మునఁ బుట్టు పెడద యౌన్నత్యము
గురువులయెడ వంగి కొలుచు భంగి
నడకలో స్వరములోఁ బొడము గాంభీర్యము
పేదవారలఁ జూచి ఖేదపాటు

పడుగుఁ బేకయుఁగా నేయబడిన యట్టు
లలరి దేహాత్మగుణము లన్యోన్యమైత్రి
గృష్ణరాయలలో నందగించుచుండ
నరసి యాశీర్వదించుఁ దిమ్మరుసు గురుడు.

నయినాంచలముల సన్నగఁదోఁచు శోణరే
ఖలఁ జల చక్రవర్తి లక్షణము చెలువు
పరదార చరణ నూపుర నిక్వణము నెంచి
మాతృ భావమ్మున మసలు తెలివి

ఆజానులంబి బాహా యుగమ్మున మాంస
లత పెంపు లొరయు చెల్వపుఁ బసందు
నెవఁడెద్ది యాశించి యేతెంచినను జేతి
కెముక లేకుండఁగా నిచ్చు విందు

తమ్మి విరిమొగ్గ విచ్చిన దళము లటులు
గొనము లీ రీతి నాత్మ శిష్యునకు విరియ
వేయి కరములతోఁ గృష్ణరాయు నొత్తి
మిత్రుఁడై తిమ్మరుసు మంత్రి మెచ్చ నతని

చదివినట్టులె యుండు సాహిత్య పాఠమ్ము ;
సంగీత కళకు నాసక్తి నెఱపుఁ ;
జేసినట్టులె యుండుఁ జెలఁగి గుఱ్ఱపు స్వారి ;
చిత్తమ్మునకు వచ్చుఁ గత్తిసాము ;
వినినట్టులే యుండు వేదాంత వాదముల్ ;
దండనీతులకు వార్తలకు మఱియు ;
అలిగినట్లే యుండు నన్యాయముల యెడఁ
జిఱునవ్వు మల్లియల్ కురియుచుండు ;

నరయుచున్నట్లె యుండు సుందరతరమ్ము
ప్రకృతి మంథరమైన శోభావిలాస ;
మంతలోఁ దనలోనఁ దా నరసి మఱియు ;
నపుడు రాయలలోనఁ దిమ్మరుసు మెఱయు

దౌదౌల నిలఁబడి తగులమ్ము ఓగనాడి
వ్యసనంబు లేడింటి పస లెఱింగి
మన మనాసక్తమై తనరఁ జతుర్విధ
మదన మార్గముల సంపదలు తెలిసి
యనభిషంగతఁ దంత్రమును గాంచి శృంగార
యువతీ యువక రీతు లవధరించి
యంతరంగము పరార్థాభిలాషల నిల్పి
యష్టభోగముల తియ్యములు పట్టి

మెలగు నా రాచబిడ్డ రాయల వయస్సుఁ
దెలిసి, యా చట్టు సిగ్గు వో దిటవు గొలిపి
వేడ్క దెందము పుష్పింప వీపు తట్టు
మంత్రి మాధవుఁడల్ల తిమ్మరుసు బుధుఁడు

తలగ్రుచ్చుకొన్న తెక్కలవంటి పంట కా
లువఁబవ్వళించు బాతువుల నరసి
మొనసి కళ్యానఁబోసిన కొల్చుఁజేటల
విసరఁ బాఱిన వొల్లువెంటఁగాంచి
యొకకన్ను నిద్రవో నొకకంట మేల్కను
వెలుగు సాలాగ్రమం దెసఁగఁజూచి
పరిగింజ నొకట ఁబల్వరుసఁదోమెడు కుంద
రదన కెంబెదవి హొరంగుఁదెలిసి

అవి వినూత్న కవిత్వ వర్ణ్యాంశములుగఁ
గృష్ణరాయ లెడందఁబొంగినపు డతని
యభినవంబగు ప్రతిభఁదిమ్మరుసు విబుధుఁ
డరసి మోదాశ్రుకుందమాల్యములు విడుచు

అతఁడుచ్చరించు మహావాక్యములలోన
భావధ్వని వ్యంగ్యపరత మెఱసి
అతఁడు చూచిన చూపునందు హైందవ ధర్మ
మర్మజ్ఞతారమ్య మహము తొనఁకి
అతడు వేసినయట్టి యడుగులో గజపతి
గతి క్రిందుసేయు పద్ధతి చిగిర్చి
అతఁడు నవ్విన నవ్వునందు నమ్లేచ్ఛమా
స్వచ్ఛ పతాకికా చ్ఛవి తనర్చి

అతఁడు తన కౌఁగిటం జేరినపుడు చిటులు
జాతి ముత్తెపు సరులలో శైత్య మెంచి
తిమ్మరుసు మంత్రి యంతరంగమ్ములోనఁ
గృష్ణరాయల దశ లపేక్షించుకొనును.

— మధునాపంతుల

# కైకేయి

*　　　　*　　　　*

కేకయాత్మజయైన
కైకేయి చిత్రరతి
భంగులను ధవుని గరగించుచూ　　　ఆమె వీ
ణియ విన్న శిలలును సుమించుచూ.　　మాయూర
కంఠమున నా పౌలతి గానించుచో, వాన
కారు వచ్చినదంచుఁ గడలు గను నా రాజు—

చపల చపలములైన
శాతశార కటాక్ష
దీపముల నింట వెల్గించుచూ,　　　గజగమన
ములతోడ మరులు గొలిపించుచూ.　　తన్వంగి
యబ్బురపు మై తొడవులై ; చిత్ర వస్త్రమ్ము
లై ; ముందు నిల్చెనా ! యది నాక మా పతికి—

*　　　　*　　　　*

కుపిత వక్రములు దృ
క్కులు నింపఁ గైకేయి
నృపుని యెద నిండఁ జీకటులూ.　　వారి ప్రే
మల తెన్నులే కట్టుకతలూ.　　　రాజు చీ

కటులు బాపను శక్తిఁ గలవి ; కైకేయి ము
ద్దిడినయెడ ముడి వీడి పడు కురుల చీకటులె—

ఆమె పద వనజముల
నతఁడు లత్తుక దిద్దఁ
దన యూర్పు తావి నిండించీ పురుషాయి
తమ్మ భాగ్యమ్మ భావించీ. రతివేళ
నామె పదముద్ర తన యొదలకు నందమై
మగని యొడలెల్ల రోమాంచ కంచుకితమ్మ

కృతకాద్రులందుఁ గ్రి
క్కిఱియఁగాఁ బ్రేమమ్మ
దా నగుచు గైకేయి యగుచూ దిరిగెదరు
దంపతులు, ముదిమురిసి నగుచూ ఆ యొరపు
లామె చిత్రింపఁగా నతఁడు తూలిక లొసఁగు
నొక్కొక్క చిత్రమున నొక్కొక్క పనితనము—

చదరంగ మాడునెడ
సకియ యోడిన నైన
గెలిచి తని నవ్వుచును బలుకూ. రారాజు
బసదనము క్రీ జూపు తళుకూ. మిన్నంది
కౌగిలించును నృపతి, కవఱు లుంకించి ప్రే
పెడు తోన నులుకు ; పిచ్చిల కుచమ్ములు జూచి—

జంకెనల వారించి
చాన ; కొప్పవియగా౽
బెఱచేతన యమర్పఁజూచూ, రాజు తను
వెల్లఁ దా గన్నులై చూచూ, ఆ చూపు
లందు నేదో కోర్కె యవఘళించును ; తోన
నే శాపమో మెదలి యింకిపోవును గోర్కె—

నిట్టూర్చు రాజు ; సతి
నిట్టూర్చు, పొగడ పూ
వుల తావి సౌధమ్మునందూ, క్రమ్మకొను
గుసగుసలు పరివారమందూ. పితృదేవు
లింక నీ వంగడం బిసుగు నోచనిదేమొ !
యనుచున్న రీతిగా నధిపు మొగమున వ్రేలు—

కైకేయి బాష్పకణ
కలిత కాంత కపోల
రెట్టింపుగా నందమూనూ, మది చెదరి
రాజు దాఁ గౌగిటను బూనూ. క్రొవ్వేది
బిఱుసైన యా రాజు దురుసు కౌగిలి ; " కోర్కె
కడదాకు వఱకు నే విడువ " నన్నటు లుండు—

ఇంచు వీణియను వా
యించునప్పుడు చాన

'కాంభోజి' పట్టినది వినుచూ, గూఢ దుః
ఖము పడతి మది నాచె ననుచూ, ఈడేర
నట్టి సంతాన భాగ్యంబైన రాజునకుఁ
గాచ దీపములు చీకటిముద్దగా దోచు—

*   *   *

— పుట్టపర్తి

## ఆవిష్కారము

ఈ యధర్మోద్ధతి నినమండలము కాంతి
తఱిగి చీఁకటి చాలు పరచె దెసల
నేతన్మహాంధకారాతతమై విశ్వ
మల్లాడి యెలుఁగెత్తి యలమటించె
నురలి పాథో భర్త యుద్ధత వీచి హ
స్తము లొక్కపై వసుంధరను జుట్టె
జాతవేదశ్శిఖా సందోహములు మింట
నెగసి తారలగుంపు పొగలఁజూపె

నీ మహా భూతములు నెల్ల నేచి యొక్క
పరిని దొరకొన్నవాక్కొ విశ్వప్రళయము

సేయ నిధియేమి వింతయో! యీ యకాల
విలయ మేతెంచి మాడ్చు నిట్టుల జగమ్ము

ఈ భూత విప్లవం బేచి మాడ్చిన విష్ట
పములెల్ల ముక్త కంఠముల దెసలు
పగులంగ రేయింబవళ్లుగ నశ్రుధా
రా జలమ్ములు నిర్ఝరములు గట్ట
విలపింప విలపింప విశ్వాంతరాళ వా
సిని దుర్గ సింహవాహన మనమ్ము
కరఁగి యే నుండఁగ దురపిల్లఁబని యేమి
యనుచు మూర్తిత్రయాస్యాంతరాళ

ములను వెలువడెఁ గన్నుదమ్ములకు దుర్ని
రీక్షము దురూహ మఖిల రాత్రించరౌఘ
మర్దనాభీల ముద్దామ మహిషనాథ
కంఠ లుంటాక మగు వెలుంగగుచు నంత

విశ్వాంతరాళవాసిని
విశ్వేశ్వరి విశ్వరూప విశ్రుత మృగరా
జాశ్వ కరాళాకృతి వి
శ్వాశ్వశ్రేయసము గోరి చనుదెంచె నహో!

అది యెన్నండు పురామహర్షి నిచయం బాత్మానుసంధాన సం
పద నీక్షింపఁగ రాని యొండొక మణి ప్రాసాద గర్భాంతరా

స్పదమై విశ్వము నిండి వెలెడు మహాస్సంతాన ముగ్రాహ్వా
న్మద నక్తంచర మర్దనోద్ధత పదన్యాసమ్ము తోతెంచెడున్

క్షిప్రాస్వాదిత ఘోర రాక్షస చమూ[illegible]
స్ర ప్రస్రోతస, ముద్ధతాయుధము, ఘోరాకార రక్షః కపా
ల ప్రాలంబము భీషణాస్యము కరాళాలోల జిహ్వాలతా
దీప్రం బుద్ధత నాట్య భంగిమము తోతెంచెన్ సమిద్వీథికిన్

ఉదయ సంధ్యారాగ మొలసిన యటువోలె
దెస లెఱ్ఱనై చూడ్కి మసలి చెదర
హరి నీల దీధితు లల్లికలై ప్రవా
హములు వోయినయట్లు తమము పర్వ
శరదభిరామ పాండుర చంద్రికా పూర
మురవడి నురుగులు విరిసినట్లు
ధవళ కాంతులు పర్వ దవహుతాశన శిఖా
సమధి కోగ్ర ప్రభ లమర వెడలె

నామె పర్యాయ లబ్ధ సంధ్యా నిశీథి
నీ శరజ్జ్యోత్స్నికాతప నియత మూర్తి
యైన కాలమ్ము వోలిక నఖిల దనుజ
లయ సమాయాత కాళరాత్రియొ యనంగ

ఒక్క కలస్వన మ్మొదయించినది మరు
త్పథ మధ్యమున, నది బహువిధ ప్ర

చార మనోజ్ఞమై తారాడి దిక్కుహ
రాంతపాళిక ననురణితమైన
నా సవ్వడులు దూరమందునవోలె ద
గ్గఱవోలె కలయ నల్గడల వోలె
విన వచ్చినవి శబ్దగుణ మాకసములోనఁ
బరవశమ్మై నృత్య భంగిమమ్ము

నెరపి నటులన్ సహస్రార నీరజాంత
రావభాసిత కర్ణికాభ్యంతరాళ
కేసర మనోజ్ఞ పరిధి నావాసమైన
శ్రీ సుధామయమూర్తి వేంచేయునపుడు

ఆరుదారు నద్దేవి యరుదేరు వేళలో
నఖిల భూతమ్ములు నంతరముల
దళిత శోకములయ్యె దనుజ సంపాదిత
ధర్మాత్యయగ్లాని తలఁగి నంత
నురలిన జలరాసు లొరలె వేలలకు నం
తర్ఘూర్ణనమున సతార నభము
విలసిల్లె నిర్ధూమ విమలతరాలోక
మున సుధాంశుని యందు వనములందు

నదులయందు నానా జంతు హృదయముల, న
సీమ మగుచును మఱియు నచింత్య హేతు

వైన సమ్మోహరస మొందనార్తవమ్ము
నెరయ నంతకు నంతలై నిట్ట వొడిచె

బంధుజీవాశోక పద్మరాగోపమ
నరుణారుణ చ్ఛాయ లడరి పుడమి
చెఱఁగులు నాలుగు చెందొవ దండల
యింపున గంధమ్ము లెలమి గురిసి
యర్ఘ్యోపయోగిత నందియున్నవి వోలెఁ
గడు ప్రసన్నములైన గతిఁ దలిర్చెఁ
జిర సమాధి స్థిర వరమౌని హృదయార
విందజాగ్రన్మధు స్యంద మమల

చంద్రహాసోజ్జ్వల ప్రభా స్తబకితంబు
నరుణ వాసోవసానమ్ము నరుణ మాల్య
మరుణ నయనాభిరామమ్ము నైన మహము
నాహవోద్ధతిఁ దెరలి రానైనయపుడు

సప్తర్షిమండల చరిత స్వరూపగా
పాథః పృషత్పుణ్య. పరిచయములు
నన్యోన్య మార్గాంత రాంతర పరిలీయ
మాన కిన్నర గాన మధురిమములు
దివ్యర్షి పరిషదుద్దిష్ట పూజాశత
పత్రమాలా గంధపరివహములు

నంతర్బహిస్సంగ తానంత చైతన్య
వాసనా పరిగత బ్రహ్మములును

నధిక సుషమాభిరామమ్ము లయ్యె నపుడు
శాంత పావన వాయు ప్రచారములను
గంధవాహాధ్వములు నేడు కలిత విశ్వ
కరుణమౌ నొక్క వెల్గు రాకడలలోన,

*           *           *

ఇష్ట్యుద్భవా ధూమలతా ప్రతానా
నభ స్తమాలే విచరన్తు సర్వతః
తదుద్గమ శ్యామ మనోహరద్యుతి
ర్వలాహకః పాతు వసుంధరా మిమామ్ ॥

అపి యజన పరాశ్చ బ్రాహ్మణా బ్రహ్మనిష్ఠా
శ్ఋతిరిహ ముఖరాచ ప్రస్రవిణ్యశ్చ గావః
క్షితిరపి బహు సస్యశ్యామ సీమా న్తలేఖా
హూత సురభి రయం నో జాతవేదా భవన్తు॥

— మల్లంపల్లి శరభయ్య

# వెయ్యేళ్ళ పాట

అది నూరేళ్ళ మాట
అది వెయ్యేళ్ళ పాట
పర ప్రభుత్వ పరిష్వంగంలో
దురంతానంత బాధాదూనమై
దురపిల్లుతున్న భరతఖండం
తరుణారుణ వజ్ర శలాకయై తళుక్కు మన్నది
చిరదాస్య దగ్ధ ముగ్ధ చైతన్యం
కరాసి చరాలున దూసినది
వాడీ వాడని తామర మొగ్గ
వేడి యెక్కి వెయ్యి రేకులతో విచ్చుకున్నది.
విరిసిన దిరిసెన పూవై
విరజల్లిన నిప్పుల ప్రోవై
విరగాసిన నెత్తురు మ్రానై
పురపురమని దేశభక్తి పొంగులు వారినది.
కృతాంతాయతనంలో
కుతకుత బలికూడు ఉడికి పోయింది.

నగాధీశ్వరుని నల్ల గుండె
భగభగ మంటలతో
ధగధగ లాడిపోయింది

మృగాధిరాజు జూలు
నిగ నిగ లాడినది

ఎమ్ముల పోగ్రివులలో
కుమ్మ కుట్టినట్లున్న పచ్చి కసి
క్రుమ్మలాడినది

త్రుప్ప పట్టిన ఉక్కు కత్తి పొత్తిట
చిప్పిల్లినది చిక్కని యాసు
ఆసేతు హిమాచలం
అట్టుడికిన ట్లుడికిపోయింది

నేల నాలుగు చెరగులా
కాలోరగాల
నాలుకలు
మేలుకొన్నవి

ఆది నూరేళ్ళ మాట
అది వెయ్యేళ్ళ పాట

నల్ల త్రాచులా తెల్ల నాచు
చల్లగా భారత కాసారంలో
అల్లు కొన్నది.

తెల్ల కలువన్నూ ఎఱ్ఱ తామరలనూ
కుళ్ళగించి వేసినది

రంగారు బంగారు పూసిన శృంగాటకంలో
భంగపడిన పుట్టలు
ముంగిట మువ్వరుసలై
భంగుల భంగుల బలి ప్రసూనాలైనవి

రత్నాలు రాసులు పోసుకున్న
రథ్యా ప్రతోళికలు
రక్తపు మడుకలతో
రక్కెస బొక్కసములైనవి.

కాలావధుల కావల
వేలా వనాంతరాలలో
హేలా విహారం చేసిన
వేలాది రుక్కుల
చూలాలు – భాంత మేధాగరిమ
కాలు కాలిన పిల్లిలా
కాలువలో దూకి
జాలిగా మూలిగినది

అది నూరేళ్ళ మాట
అది వెయ్యేళ్ళ పాట

ఒక్కుమ్మడిగా
ఉక్కు పంజరం బ్రద్దలు కొట్టుకొని
ఉక్కు మీఱి ఉన్నత పథాల వేపు
ఉపక్రమించ దొరకొని
ఉష్ణీషం ఊపిరి తీసుకున్నది
వజ్ర కవచం వళ్ళు జలదరించింది
ఖర కరాసి కళ్ళు విడిచినది
ఉవ్వెత్తున ఉత్తమ మస్తిష్కంలో
చువ్వలు నింగి కెగసినవి.

మనసు మాళిగలో ముడుచుక పడివున్న
తను ధన సర్వస్వ త్యాగబుద్ధి
మునుకొని వళ్ళు విఱుచుకొన్నది

నా దేశం, నా ప్రజలూ
భేదాల గాదెలు కారాదనీ,
నా దేశం నా ప్రజలూ
మోదుగులై మూసులెత్తవలెననీ
ఏ దేశ ధనస్వామ్య దాస్యానికో
పాదులు కారాదనీ

ఓ దివ్య జ్యోతి
దేదీప్యమానమై
అతల వితల సుతల

తలాతల మహాతల రసాతల
పాతాళాల నుండీ
భూర్భువస్సువర్మహ స్తప స్తైజోలోకాల
శిఖా శిఖాంచలాల దాకా
వెలుగుల వెల్లువలను
జలజలా క్రుమ్మరించినది

అది నూరేళ్ళ మాట
అది వెయ్యేళ్ళ పాట

కోటి కంఠాల ఠాంకారం
నాటి గుండెల మీటినది
కోటి గుండెల ఝూంకారం
నాటి తలల నాటినది
కోటి ఆజానేయాశ్వాల
ఖురఖుర ఘట్టన ధ్వానం
నాటి రక్త నాళికలలో
ఊట లూరినదీ

కోటి విచ్చుకత్తుల చకచ్చకలు
నాటి కోటల కూకటులలో
చీకటులు దులిపి వేసినవి

అది నూరేళ్ళ మాట
అది వెయ్యేళ్ళ పాట

*     *     *

తొలిసారి మొలిచినది
కలలలో స్వేచ్ఛ
తొలిసారి పిలిచినది
తలపులో స్వేచ్ఛ
తొలిసారి కలచినది
వలపులో స్వేచ్ఛ
ఆ నాటి పాట మన
కీ నాడు ముగిసె
ఈ నాటి పాట ఇం
కెన్నడో ముగియు

ఈ పాట యింతతో మూగవోరాదు
ఈ బాట యింతతో ఆగిపోరాదు
ఈ మాట యింతతో వీగిపోరాదు

నా నాట స్వేచ్ఛా స్వతంత్రాలె కాక
నా నాట సర్వ సమ్యక్సిద్ధి పూచు—
ఆ నాటి దనుక – ఈ నూరేళ్ళ పాట
ఆ నాటి దాక ఈ వెయ్యేళ్ళ పాట

నా నాడు గుండెలో
నాగమై తిరుగు
నాగమై తిరుగు తన
భోగమ్ము విప్పి.

— విద్వాన్ విశ్వం

## సాహస్ర మాన్మథము

కమలమ్ము, లశోకమ్ములు,
కుముదమ్ములు, చూతములును, కుందమ్ములు, పూ
లు - మృదువులు, భావనా పర
మములు, పరిమళావధులు అమాంతము తోచెన్

పూవుల్ పూవులు విచ్చుకొన్నవి ధనుః పుష్పోగ్ర నారాచ లీ
లా వై చిత్ర్యము పాదుకొల్పిన దొరా! లావణ్య సౌందర్య వే
లా విద్యుల్లహరీ స్ఫురన్మధుర బాలా నీల నేత్రాంత శో
భా వీథిన్ దిగి వచ్చినట్టి శిశువా! పాలింపు మీ చైత్రమున్

ఈ యెడ ఎవ్వరో పరిమళింపగ జేసిరి - పుష్పముల్ దిదృ
క్షా యతి సహ్యముల్ - గిరుల యందున, గ్రామములన్, పురంబులన్,
లోయలలోన, ఎల్లెడలలో ఒక పుష్పమె ఒక్క మన్మథుం
డై యతిలోక మోహన మహాద్భుత దర్శన మావహిల్లినన్

వేలై మన్మథు లాక్రమించిన దిశల్ వీణాక్వణత్క్రమ రో
దో లావణ్యము కూర్చుకో, దిశల దంతుల్ గున్నమామిళ్లగా
నాలో మన్మథ మన్మథమ్ములు చలన్నవ్యాంబు దార్ద్రింబులై
మాలా రమ్యములైన ఊహలు మృదూన్మాదక్రియా హేతువుల్

చెరువున గండి పడ్డటుల, చేతము నందున కోర్కులేవా ము
ప్పిరి గొనె; ఒక్క పెద్దడవి భీకరమైనది దావవహ్ని ధు
ర్భరమయి కాల్చివేసినటు - పాల సముద్రమువోని శాంత సుం
దరమగు నా యెదన్ అదుపు దాటిన కోర్కులు పెల్లు రేగెడిన్

ప్రవరుం డొక్కడు నేనుగా- సకల విశ్వంబందు నున్నట్టి మే
లి వరారోహలు కన్యకల్ మదనకేళీ దాహ సంతప్తలై
ఎవరో ఒక్కరు గాక అంద రొకసారే వచ్చి ప్రార్థించి పో
వ వలెన్, నేను తిరస్కరింపవలె, సర్వస్త్రీ సుధావీచులన్

నగ్నములౌ ఒడళ్ళు, కనినంతనె పొంగులు వోవు యావనో
ద్విగ్న రసైక వాహములు, వ్రీడ ఎరుంగని సోగ కన్నులున్
అగ్నులవోని కోరికల అంతరమందు జ్వలించు కామ సం
లగ్నలు మద్వియోగభరలక్ష్యము లచ్చర లెన్ని వందలో ?

ఎదలో కామము కొల్చుకో దగినదా ? ఈ కత్తులౌ కన్నులున్,
తుదలన్ చక్రము లట్లు వెల్గులను చిందుల్ ద్రొక్కు నేత్రంబులున్
మద సంప్రసన్నయనంబులున్, భువన సామ్రాజ్ఞీత్వ దర్పాక్షముల్,
ఉదిత స్వప్నము లంబకమ్ములు - నవర్తూన్మాదముల్ పెంచగా

రాగము వోలె, తెల్లని పరాగము చల్లెడి గాలివోలె, అం
తా గిలిగింత పెట్టు ఉదితారుణ కాంతుల వల్లి పోలికన్,
తూగు తరంగముల్ వలె, ఎదో ఒక పచ్చని చేనువోలె - ఈ
మూగిన పంచ భూతముల మైకము స్త్రీమయమై జ్వలించినన్

ఈ ఉన్నదెల్లయు ఒక్క స్త్రీ యయినచో
అనుభవించెడి కోర్కె కదుపు గల్గు
నా ? కనులందు సుధా క్రాంతి విషభూతి
అయిన ఆ యమ చూచినంత బెదరి
పోవనా ? గుండెలో పుట్టిన వాంఛల
ఊట తా నయి యింకునో తెలియదు —
ఆ యమ కావలె నన్న కోర్కియె కాని,
ఆనంద భావ పర్యాప్తి లేద -

ఈ ఎడద తాను కామేచ్ఛ ఏల సృష్టి
లోన లేనంత తనలోన రేపుకొనియె ?
ఈ సహస్ర మన్మథభావ మెట్టు లొదిగి
పోవునో ! ఎద కాల్చియె పోవు నేమొ !

పూవుం బూవున పొల్చు మన్మథుడు చంపు న్నన్ను ఈ విశ్వ రూ
పావిర్భావము పొల్చు మన్మథుడు నేనా ? ఔను నేనే ! అనం
తావేశంబున సర్వసృష్టి సొగసంతా దోచుకో నెంచినా
నీ వేళన్ మృదు వాయు వీచికలలో ఈ పూలలో తావిలో.

— సుప్రసన్న

## పిచ్చి దానిమ్మ చెట్టు

తెల్లగా వెల్లవేసిన ఈ వసారాలలో
అనుకూల దక్షిణ వాయువులు ప్రసరించే అందమైన గదుల వెలుపల
ఇట్టే వెలుతురులోకి ఉరికేది
ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా, చెప్పవూ ?
ఉయ్యాలలూగే గాలుల గుసగుసలలో
సారవంతమైన తన సంతోషాన్ని వెదజల్లేది
ఎవరు చెప్పవూ, ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా ?
ఉదయవేళ అపుడే తొడిగిన మొగ్గలతో
ఊగుతూ ఉవ్వెత్తుగా తన రంగుల పింఛం విప్పి
విజయగర్వ రోమాంచంతో కులికేది
చెప్పవూ ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా ?
పాలికాపు బాలికలు పొలాలలో నగ్నంగా
నిద్రి బద్ధకపు లోతులు దులిపేస్తూ
లవంగాల్ని తమ పసిరిక చేతులతో పోగుచేసేటప్పుడు
చెప్పవూ ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా
సూర్య కాంతిని వాళ్ల తట్టల కెత్తేది ?
వాళ్ళు పిలుచుకునే పేర్లని పాటలతో ముంచెత్తేది ?

చెప్పవూ ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా
ప్రపంచపు నీడలతో పోరాడేది ?

ఈసులాడి దినం తన్ను ఏడు నిగనిగని రెక్కలతో
అలంకరించుకొని
అనంత సూర్యబింబం చుట్టూ ఆకాశ సహస్రాలను చుడుతున్నప్పుడు
చెప్పవూ ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా
వెయ్యి కొరడాలు పుచ్చుకొని
దౌడు తీసే గుర్రాలను జూలులాగి నిలబెడుతుంది ?
ఒకసారి విషాదంతో, ఒకమారు విభ్రమిస్తూ
ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా చెప్పవూ
ఏదో నవాశా ప్రభాతాన్ని ఎలుగెత్తి చాటుతుంది ?

ఓహో చెప్పవూ ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా
సుదూరంలో పరవళ్ళు తొక్కుతూ
వెయ్యి పడవల్ని కడుపుతో ఉన్న కడలిలాగ
ఇతరుల అడుగుజాడ లెరుగని తీరాలకు
విరగబడే కెరటాలు పంపుతూ
చెప్పవూ ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా
ఆకుల పోకెట్ రుమాలు ఊపుతుంది ?
సరికొత్త నిప్పులు చెరుగుతుంది ?
చెప్పవూ ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా
తేట తెల్లని గాలికి తెరచాప లెత్తుతుంది ?

నిర్లక్ష్యంగా ప్రమాదకరంగా
ద్రాక్ష లతల వినీల శిఖరాల మధ్య
విందులతో వీరావేశంతో
ఎవరు చెప్పవూ ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా
ప్రపంచపు నడుంమీద వెలుతురుతో విరుచుకు పడి
రాక్షసి తుపానుల ప్రసారాన్ని ప్రతిఘటించి
చెప్పవూ ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా
పంటలతో పాటలతో సరిగంచులు దిద్దిన
ప్రత్యూషపు పసుపు పచ్చని సింహపు జూలు పట్టుకొని
దివసకాంత కట్టుకున్న పట్టుచీరని
హఠాత్తుగా జార లాగివేస్తుంది ?

చైత్ర మాసపు రవికలు ధరించి శ్రావణ మాసపు విపంచి ధ్వనించి
చెప్పవూ ఆడుకునే పాడుకునే ఈవిడ
బీభత్సాన్ని పట్టుకొని ఊపేసి
కాటుక చీకటి నీడలు రాల్పించి
సూర్యుడి గోలెంలో మత్తెక్కిన పక్షుల్ని వొంపే ఈవిడ
సమస్త వస్తువుల హృదయాలలో
మన ప్రగాఢ స్వప్నాల గుండెలలో
విశాలంగా తన రెక్కలు విప్పుకునే ఈవిడ
ఎవరు ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా ?

[ఒడిస్స్యూస్ ఎలిటిస్ గేయానికి అనువాదం]

— శ్రీ శ్రీ

వాంఛాసుమితి

ఒక కొండకొమ్ము కొన ని
ల్వక క్రిందికి గుండు జారి పడు సవ్వడి పో
లిక, మిన్ను నవ్వికొనిన
ట్లొక ఉరు మది దిక్కు కొనలనుం డిటు వచ్చెన్

ఎట ఏ మూలనొ ఒక్క గర్జ, మరి అట్లే ఒక్క విద్యుత్తు, వే
సటలం గుండు నెడందకున్, జిరము వెచ్చన్ గ్రాగు ప్రాణాని కూ
రటలం గూర్చగ జాలు, పైన మరి తంద్రాశీల మీ మబ్బు లిం
తటివై మింటిని గప్పెడున్ బ్రదుకులోనన్ జిల్ల పందిళ్ళుగా

మూలల్ మూలలనుండి చిన్నచిన మబ్బుల్, క్రొత్త అందాల నీ
లాలై, విచ్చిన నల్ల కల్వ లయి, లీలాలాస్య కృత్యేక్కి పిం
ఛాలై, ఎల్లెడ మింట గ్రమ్ముకొని స్వచ్ఛాయా ప్రసారమ్ములన్
నేలన్ సర్వమునందు స్వప్రభుత నందెన్ వార్షిక స్వామ్యులై

ఈ విద్యుత్తులు విచ్చుకొన్నయవి, తా మీ గాఢ నీలాభ్ర మా
లా వల్లీ తనువెల్ల పువ్వులయి, హేలాహాసముల్ మోము నిం
డా విప్పారిన ఈ వియత్తు మనసంతా నిండు వాంఛాళియై,
ఏవో నూతన లోక నిర్మితికి చిత్రించే ప్రభారేఖలై

ప్రామిన సన్నజల్లు వలిపంపుతెరల్ విడదీసికొంచు, ఊహా మధురమ్ముగా వెలుగు లల్లిన దారులనుండి వచ్చి సౌదామని నా ఎడంద కెడదన్ గదియించిన నేమియయ్యె! వాంఛా మితిలేని ఈ మనసు సౌఖ్య మదొక్క నిమేషమాత్రమై

ఈ సనసన్న జల్లె గిలిగింతలుగా నునుసిగ్గు వోవు పృథ్వీ సతి, తాను గంధవతి, విచ్చిన వేయివిధమ్ములైన ఉచ్ఛ్వాసము లట్లుగా, మధుర వాసన లెల్లను వ్యాకరించు నా ఈ సుకుమార మానస మిదెల్ల పురాస్మృతి బంధకస్తమా

మరి ఈ వాసన లెల్ల నూత్నములు సంస్పందమ్ములా ఏమి? జీవ రహస్యమ్ములుగా మనః పుటిని నీవారాంత శూకాగ్ర భాః పరమమ్ముల్ పరిలీనముల్, చిరములై వ్యాపించు నీనాడు, బాహిరమైనట్టి సధర్మ కర్షణముతో ఈ ఎల్లయుం దాముసై

నేనై తా మొదలైన వాసన లివన్నీ, ఆమె నేత్రాంత వీక్షా నైశిత్యమునన్ సహస్ర విధ వాంఛారేఖలై చీలి, సంధ్యా నృత్య చ్ఛిఖి పింఛ కేసరములై, తాపింఛ నీలాంబుద శ్రేణీకోణ మనోహరారుణ విభాశ్రీలై, ఎదన్ కల్చెడున్

ఈ వాంఛల్ బడి లక్ష యాతనలు, మి న్నైతైన దీ వాంఛ మిన్నా. విస్ఫూర్త తమోగుణమ్ము బహుధా నై మబ్బు తున్కల్, తథాభావమ్మందును నొక్కసారి సుఖ మాభాసించు. ఐరమ్మద శ్రీ విస్ఫూర్తి వలెన్ నిరంతర ధురారేఖా నిరాసమ్ముగన్

వెలిగిన దివ్వె కొట్టకొన వచ్చిన చిక్కని ధూమరేఖ, మి
న్నలమిన గాఢ ధూమమున ఆడెడు చిన్నరి విస్ఫులింగ, మీ
పొలకువ నున్న దీ సుఖము పొందుట దుఃఖము పొందుటల్ ; నిరా
కులముగ లేని వీ ద్వివిధ కుంచితమౌ అనుభూతి మార్గముల్

అల సర్వమ్మున నుండి వేరయి 'తృతీయఃపంథ'లో సాగు వాం
ఛలతో సంచలనమ్ము పొందెడు మన సౌఖ్య మ్మిదేమో ? ఇది
ట్టు లటంచున్ మరి వేరువేరు విడిపాటుంగూడ చేయంగ లే
క, లిలీక్షామతి నయ్యెదన్ వివృత లోకమ్మందు ఒక్కండనై,

ధనువై సామి మనోజ్ఞ చక్రము వియద్భాగమ్ము, చిన్నారి చ
క్కని రెక్కల్ విదలించుచున్ జను బలాకాశ్రేణి తా నారియై
సనజల్లుల్ విశిఖమ్ములైన మదన స్వామీ ! ఇదో ; గుండె వి
చ్చిన ఈ బాడబరీతి వాంఛలను వెచ్చింతున్ త్వదర్థమ్ముగన్.

— సంపత్కుమార

## విశ్వ వత్సల

తల్లీ ...... తల్లీ ......
తారా కోరక తరళితవల్లీ !

నీ యెదలో చిరు తరగ లూగెనా
ఆయుర్వాహిను లవతరించవా !
నీ కొన చూపుల నగవు సాగెనా
జగాలు వెలుగుల జిలుగు దాల్చవా

నీ యొడి ప్రేముడి నేర్పే బడిగా
నెన్నడియే యొక నీతి బోధగా
నీ నును తాకిడి కీ నరలోకము
వన్నెలు చిన్నెలు విప్పారేనా ?

నెన్నదురున ముది మిన్ను చాళ్ళలో
ఎన్నో జగాలు మూగిన వమ్మా
నెరసిన కేశము నిగ్గుల ఖోగై
విరిసి వదనమే అమృత సదనమై !

మా కొరకని నీ కార్చిన ధారల
నొకటి జేయ వినువాక లురలవా ?

మా పతనమ్మున నీ తడియూర్పుల
పేర్పు కట్టి సుడి గాడ్పౌను కదా !

వీరుల మని ధాత్రీశుల మని మా
క్రూరులు మీసాల్ వడ ద్రిప్పెదరే
హాలికులకన్నా శూరు లుందురా !
చెమటల కన్నా నెత్తురు మిన్నా ?

పోరు నడుమ జడివాన కురిసినా
కలహము కౌగిలిలోన ముగిసినా
నీ విరికన్నుల విరివి కాదటే
చివురు గుండె తడి వరము కాదటే

పంట పొలము పీనుగ తుంటలకా ?
పనిసాలలు చెరసాల లగుటకా ?
పెంపు సొంపులా తెంపు రంపులా
ఏ మార్గము సన్మార్గము తల్లీ ?

వానలు కోనలు పాపలు పూపలు
పిట్టలు పశువులు పుట్టలు పొలాలు
నీ రూపే నని నేర్చితి మమ్మా !
నీ సంతే నని యెరిగితి మమ్మా !

పాల బాటలో పాల బుగ్గలో
కలకల మందున కిలకిల లందున

కలలో మెలకువ లోపల నీవే
ఇలలో మిను మిలమిలలో నీవే!

తల్లీ ...... తల్లీ ......
లలిత తారకా కుసుమితవల్లీ

— రమణా రెడ్డి

## సంగీత వృత్తము

ఒక సంగీతము లోన లో నొదిగె ఏదో బాధగా తీయగా
ఒక చాంపేయ పరీమళానిల తరంగాలోలమై, నూత్న యౌ
వని శృంగార పదాభిరామ విలసన్మంజీర నిక్వాణమై
ఒక హేమంత రహోనిశన్ కురియు రాకాకౌముదీ వర్షమై

ఒక కాంక్షా మధుమత్త యౌవనవతీ ఊహా రసాంభోధి వీ
చికయై శైల విశాల సానుతట రమ్యాంభోద మాలా చల
చ్చపలా నవలాస్య వల్గు గమనమ్మై ప్రాతరున్మీల ప
ద్మిని పత్రాగ్రములందు విచ్చు హిమ భాషా స్వప్న సంకేతమై

ఒక సాయం గగనారు జాంబుదపు టంచుల్ రెక్కలం దూసి చీ
కటి బాణమ్మటు వచ్చు దేగవలె నై కన్దోయి కల్లల్ల దూ
రపు కొండన్ అరవిచ్చు చుక్క చెలి సింగారించు లేనవ్వు పి
ల్పయి ప్రత్యగ్ర మధూత్సవాభిరత లీలాభృంగ కల్హారమై

ఒక బాధాగ్రథితమ్ము పాండుర కపోలమ్మందు కేలూని వె
చ్చన నిట్టూర్చెడి మాతృమూర్తి నయనార్ణోరాశియై, ఆత్మ హ
త్యకు నుంకించెడి భాగ్యహీనుని మన శ్శైథిల్యతా చిత్రమై
ఒక దూరాధ్వమునందు ఎద్దు మెడమువ్వల్ మ్రోగుచున్నట్టులై

ఒక నిశ్శబ్ద భయాంధకార విపిన మ్మంతటన్ రేగు దు
ర్జన వాంఛాజ్వలనోగ్ర కీలల వలెన్ రాత్రిందివా మధ్య రే
ఖా కిర్మీర విచిత్ర జాగృతియునై ఉన్మత్త రాత్రించరత్
పతిత ప్రాణి సమూహ హృద్ధమని కాస్పంద జ్వరాక్రోశమై

ఒక తెరువేదో విచ్చుకొని ఉన్నత దివ్య నగాంచల స్థిత
మ్మగు గుడిలోని దైవపద సన్నిక టాద్భుత ధూప దీప కాం
తుల కడ కేగి లీన మయినట్టుల; ఒక్క మయూర బర్హ సుం
దరతర మౌళిమోహనుడు దవ్వుల రాసము చేసినట్టులై

ఒక జన్మాంతర చిత్ర సంస్మృతి వలెన్ లోలోన మత్ జీవనాం
తర గాఢాంధ్యమునన్ హఠాత్ జ్వలిత దీపశ్రేణి వోలెన్ మ రే
మియొ నా తనువెల్ల సౌరభములోనన్ చుట్టినట్లయ్యె కై
తక కుంజాంతర నిత్య వాసిత మహావ్యాళమ్ము లీలాకృతిన్

— తిలక్

## నగరంలో వాన

నగరంలో వాన –
కవిత్వం నా ఊహాంచలాల్లో కదిలాడుతున్నట్లు
జల్లులు జల్లులై కురుస్తుంది
ఆశుకవితలో నగర ప్రజలకు
ఆశీస్సులు పలుకుతున్నట్లు
అనంత ధారా సమేతంగా అంబరం మెరుస్తోంది.
నగరంలో వాన.........

అంబరానికి అంత సంబరం ఎందుకంటే :
నున్నగా తెల్లగా తళతళలాడే
సిమెంటు రోడ్ల అద్దాలలోకి
మింటి నుంచి మెడలు వంచి చూసి
తమ అందం చినుకుల కుప్పలుగా పోసి
అంచు లేని ఆకాశమంత ఆనందంతో
మెలికలు తిరుగుతూ మిలమిలా మెరుస్తాయి మేఘాలు.

పక్షులు పోయినా పాదాలు వచ్చి
పర్వతాలు పోరాడుతున్నట్లు
పరుగెత్తే రెండంతస్థుల బస్సుల్ని చూసి

గిరి శిఖర భ్రాంతితో క్రిందికి దిగి వచ్చిన మేఘాలు
పైకి తిరిగి వెళ్ళడానికి బద్ధకం వేసి కాబోలు
బహుకాల నగర దర్శన భాగ్య ప్రాప్తిచే కాబోలు
ఆ రాత్రికి సినిమా చూసి ఉదయమే వెళ్ళొచ్చని కాబోలు—
గిరి శిఖర భ్రాంతితో క్రిందికి దిగివచ్చిన మేఘాలు
అక్కడే నిలబడిపోతాయి, హర్షం వర్షంగా కురిపిస్తూ.

నడి బజారులో పడిపోయిన మూర్ఛవాడు
బిందెలతో దాహం త్రాగినట్లు
పగుళ్ళు వారి నోరు తెరుచుకున్న భూదేవికి
పల్లెల్లో పది చుక్కలైనా లెక్కుండదు.
పల్లెసీమలో వానల మేనాల మీద
దివి నుండి సస్యసమృద్ధి దించే వర్షాకాంత
అవసరం లేనప్పు డడిగితే అప్పులు సులువుగా లభించినట్లు
అక్కరలేని నగరంలో కూడ
పుష్కలంగా కురుస్తుంది.

విసుక్కునే నగర ప్రజల వీపులు చిల్లులు పొడిచే
జల్లులతో వెక్కిరిస్తుంది సగం వచ్చి సగం రాక
స్వాగతం చెప్పని పట్నవాసాల సాగిన ఉదయపు జల్లు
రాత్రి వచ్చిన చుట్టంలా తిష్ఠ వేస్తుంది తీరిగ్గా

* * * *

నగరంలో కురిసే వానకు తెలుసు —
గొడుగు జీతపు రూకల్లో మిగిల్చి
కొనగలగడం వట్టి మాటని
గోనె సంచీ కప్పుకోవడం నాగరికులకు మోటని
తడిసి మోపెడై వణకుతూ వచ్చి
వంటింట్లో కుంపటి ముందుగా కూచోని
మర్నాడు మంచ మెక్కితే
తను చూసిన ఘనకార్యం కనులార చూసుకుంటున్నట్లు
కిటికీ లోంచి తొంగి చూస్తుంది
చిటపటా చిలిపి జల్లుల్తో.

నగరంలో కురిసే వానకు తెలుసు —
పలకా పుస్తకాలు నెత్తిన బెట్టుకుని
పరుగెత్తే బడిపిల్లవాడు
కాలుజారి బురదలో పడినా
కారు చక్రాలు మురికి చిమ్మినా
వాళ్ళమ్మ వాడ్నే అరుస్తుందని
తల్లీ కొడుకుల చర్చ తన మీదికి మొగ్గకుండా
తీరా ఆ సమయానికి తెలీనట్లు వెలిసిపోతుంది.

నగరంలో కురిసే వానకు తెలుసు —
ఆఫీసులు సరిగ్గా సాయంత్రం

ఐదు గంటలకు వదుల్తారని
ఉన్నవాడు ఉదయం తెరపచూసి
ఉన్ని సూటు వేసుకున్నాడని
లేనివాడికి లేనేలేదని మర్నాటికి మరొక జత—
అందాక నిర్మేఘమైన ఆకాశం
ఆ క్షణాన చిల్లి పడుతుంది.

నగరంలో కురిసే వానకు తెలుసు—
నాగేశ్వర్రావు ఉదయమే లేచి
తీసుక పోవలసినవన్నీ తీరిగ్గా గుర్తు తెచ్చుకుని
కొత్తగా కొనుక్కున్న గొడుగు వెంటబెట్టుక వెళ్ళాడని.
ఆ రోజు చినుకు చినకదు ;
రాత్రికి యింటికి చేరి వృథా శ్రమకు విచారిస్తుంటే
ఉరుములు ఫెళఫెళార్భటులతో
విరగబడి వికటాట్టహాసం చేస్తూ
నగరం నాలుగు మూలల
కుంభవర్షం కురుస్తుంది.

ఇలా నగరంలో కురిసే వాన కేవలం గడుసరే కాదు
దానికీ కాస్తో కూస్తో దయా, ధర్మమూ వున్నాయి ;
మూడు నాళ్ళ పసిపాపను
ముద్దుగా ఒడిలో గుండెల కద్దుకుంటూ
వెచ్చగా ఆస్పత్రి నుండి పచ్చగా యింటికి వెళ్ళే

పచ్చి బాలెంతరాలి మీద
పూల జల్లు పడుతుంది గాని
భోరున వర్షం కురవదు.

ఆగస్టు పదిహేనో తేదీన జెండా వందన సమయంలో
పండు పెడతారనో, చిరుతిండి పంచుతారనో
రెండు మూడు గంటల సేపు
బారులు తీరి నుంచున్న పసి బాలబాలికల మీద
జాలిగా సన్నని తుప్పర పడుతుంది గాని
జలజలా వర్షం కురవదు.

*　　*　　*　　*

నగరాల నాగరికత సులువుగా మరిగిన సూర్యదేవుడు
తెల్లవారి రేడియోలో తెలుగులో వార్తల చివర
వాతావరణం వింటే కాని, ఒక పట్టాన నిద్ర లేవడు.
భూమ్మీద పస్తులున్న మనుషుల్ని చూసి
ఆకాశం కంట తడి పెట్టినట్లు
వాన ముమ్మరంగా కురుస్తుంటే
ఉదయం నుండి సూర్య భగవానుడికి
ఊపిరి సల్పడంలేదు.
రిక్షాలో కూచున్న ఘోషా సుందరిలా
ముఖానికి అడ్డం కట్టిన మొయిలు ముసుగులు తొలగించి

ఎన్నిసార్లు చూశాడో లోకం వేపు
శత సహస్ర కిరణాల బాకులు ఝళిపించే
చాకచక్యం తగ్గింది
ప్రాణాలు తీసే ప్రతాపం – పాపం
శీతలానికి తల ఒగ్గింది.

బ్రదుకులో సాధించ దలచిన దానికి
పరిస్థితులు కలిసిరాని మానవ మాత్రుడిలా
ఆ వేయి వెలుగుల దొర అగుపించడం లేదు
ఆయన రథం ఆగిందో, నడుస్తోందో
ఆకాశానికే తెలీదు.
ఉదయమే వేటాడడానికి ఉర్వి మీద మంచు లేదు
మధ్యాహ్నం మండించడానికి
మబ్బుల కంచుకోట కదలదు.
పగలనే పేరు సార్థకమై పతి ఒల్లని భార్యలాగా
ముఖాన తిలకమేనా లేకుండా
ముడుచుకూర్చుంది దివసం.
ఉద్యోగం ఊడిన కొత్తలో, భయంతో
కనపడినవాడి కాళ్ళ మీదల్లా పడి
కొత్త సిఫార్సు చేయమని కోరినట్లు
ఏదో ఒక దేవుణ్ణి ఆశ్రయించడానికి
వెళ్ళి వుంటాడు రవి.

పిల్లకాయలు తియ్యగా తినే పిప్పరమెంటు బిళ్ళలా.
ఏ మిట్ట మధ్యాహ్న సమయానికో
ఉన్నాననిపిస్తాడు; కనిపిస్తాడు కష్టం మీద
అన్నం ముట్టని వ్రతంతో అంబరం వేపు
అదుగో యిదుగో అని
ముక్కుతూ మూల్గుతూ చూసే ముసలమ్మల కోసం.

మళ్ళీ సాయంత్రం అంతే —
మబ్బులతో నేసిన ఉన్ని దుప్పట్లు
ఉన్నవాడు కనుక పుష్కలంగా
పడమటి కొండ పడగ్గదిలోకి
మూడింటికే చేరి ముసుగు కప్పుకుంటాడు.
నగరాల నాగరికత
నాలుగు కొండలు వెళ్ళ జడిపిన
సూర్యుడు సోమరిగా తిరుగుతోంటే
పులిగా ముప్పూట ప్రతాపించి
చలి ఎముకలు కొరికేస్తుంది

* * *

వాన కురిసే సమయం కోసం వారం పది రోజులు వేచి
పరస్పరం సమాంతరంగా వర్షాదిలో భూమికి దిగిన
ముత్యాల వంటి రెండు చినుకులు
మిలమిలా మెరుస్తూ జలజలా జారుతూ

వచ్చిన దారిని నిచ్చెన చేసి
ఉవ్వెత్తుగా లేచిన ఊహతో మెల్లిగా మెట్లెక్కి పోయి
మేఘావృత గగనం లోంచి మేదిని వైపు చూతును గదా
నగరం గడగడ వణికి పోతున్నది
నగరం నడి సముద్రంలో తేలాడుతున్న ద్వీపంలా వుంది
ఉడువీధి నుండి జారిన ఒక మంచుకొండ ఏదో పగిలి
శతకోటి శకలాలు జల బిందువులుగా మారి
ముసురుగా ముంచెత్తు తుంటే
గూట్లోకి చేరిన గువ్వలా నగరం నక్కి కూచుంది.
ఆకాశపు పెండ్లికొడుకు అనేక శతాబ్దాల క్రితమే
నగర కాంతకు మెళ్ళో కట్టిన
తగరపు తాళి బొట్టులా
తళతళా మెరుస్తోంది హుసేన్ సాగరం చెరువు
కదుల్తున్నాయి కార్లు బాలవీరులు విసిరిన కత్తి పడవల్లా.

ఎర్రరాయి చెక్కిన ముక్కు పుడక లాంటి
విద్యుద్దీపం విరజిమ్మే కాంతిలో
పావురంలా పరుగెత్తుతోంది
టపా మోసుకు వస్తున్న విమానం.
రంగు రంగుల దుస్తుల్లో రబ్బరు బొమ్మల్లా
అక్కడొకడు ఇక్కడొకడు మనిషి
కదిలినట్లే కనపడ్డది కాని

అంతా స్తంభించి పోయింది; అరగంట సేపు నిశ్శబ్దం
ఆకాశరాజు చేసిన దాడికి నగరం నలిగిపోయింది.

రైళ్ళు కూయడం లేదు
ఆఫీసులో ఫైళ్ళు రాయడం మానుకున్నాయి
వారాంతపు శెలవుల చట్టం ఉల్లంఘించిన కిరాణా వర్తకుడు
సగం తెరిచి పెట్టిన తలుపు పూర్తిగా మూసేసుకున్నాడు.
సిమెంటు గొడుగు చిల్లిగవ్వకు కొరగాక
మామూలు ఎగేసి తనకే నామాలు పెట్టిన ప్రక్కింగట్లో
తలదాచుకున్నాడు ట్రాఫిక్ పోలీసు
సరిగ్గా పావలా దూరాన్ని "సవా రూపాయి"కి పెంచమంటూ
వర్షాధిదేవతను రిక్షావాండ్లు
వరాలు కోరుకుంటున్నారు
సైకిలుకు కట్టిన బిందెమీద
గుడ్డముూత పూర్తిగా తీసేసి
వణుక్కుంటూ పాలవాడు వరండాలో నుంచున్నాడు.
మీట నొక్కి యింట్లో లైట్లు చూసుకుని
మూలబడిన బెడ్ లైటు భాగాలను
బాగు చేసుకుంటున్నారు గృహిణులు.
తెల్లవారితే మడి బట్ట లారవని
దిగుల్తో పడుకుంది ముసలమ్మ
నడి యవ్వన బలంతో వానలో నడుస్తూ పోయి. ఫర్లాంగు దూరం

చటాకు చేమంతి పూలు తెచ్చాడు
కొత్తగా పెండ్లి చేసుకున్న గృహస్థు
మర్నాడు కాలేజికి శెలవు యివ్వకపోతే
సమ్మె చేయాలని శపథం పట్టాడు
చదువుకుంటున్న కుర్రాడు
చీకు చింతా లేకుండా, అమ్మా నాన్నా వద్దంటున్నా
వానా వల్లప్ప లాడుతూ
పరుగులు తీస్తున్నారు పసివాండ్లు
అంతా స్తంభించిపోయిం దనుకున్నాను
అరగంటలో అనంతకోటి దృశ్యాలు !

* * *

అప్పుడు దిగివచ్చిం దూహ నేలమీద నే నేమి చేస్తున్నానో అని
నేలమీద నే నేమి చూస్తూ వున్నానంటే :
సాయంత్రపు షికారుకు మూడు గంటలు ముస్తాబై
దవనం బేర మాడుతూ నుంచున్న జవరాలు జడలో ముడిచిన
గులాబీ పూవులో పడి రేకలమీద ప్రాకుతూ
వర్షాంతంలో భూమికి దిగిన ఒకానొక ముసలి జల బిందువు
కులికింది కోటి జన్మాల కోరిక నెరవేరినట్లు
అందాక దానితో కలిసే వచ్చి అరంగుళం ప్రక్కగా బడి
భూగర్భపు మురికి కూపంలోకి పోయిం దొక జలబిందువు
ఎత్తైన విద్యుద్దీపం మీదికి ఎక్కి నిక్కి చూసిందొక చినుకు

చెట్టుక్రింద చీకట్లో పడి దారి తెన్నూ తెలీక

చిందులు త్రొక్కింది దొంక చినుకు

ఆవులిస్తున్న నవ నాగరికుడి

అధరోష్ఠంమీద వ్రాలిన చినుకు

మధువు వాసన వేసి కాబోలు

మై మరచి తైతక్క లాడింది

కిటికీలోని మందు సీసాలో పడిన చినుకు

చేదెక్కి శరీరమంతా

ఏ కమ్మని పల్లెటూరి పంట చెరువులోనో పడక

నగరాని కెందుకు వచ్చానని నాలుక కొరుక్కుంది

చదువులతల్లి స్తన్యమంత మధురమైన మరొక బిందువు

విశ్వ విద్యాలయావరణలో

వెలిసిన వెలుగులో కలసిపోయింది

చార్‌మినార్ గోపురాగ్రంమీద పడి నిలచిన చినుకు

ఎత్తైన సింహాసనంమీద ఎక్కిన ధీమా కాబోలు

కాలుమీద కాలేసి మీసం మెలేసుకుంటూ

నగరం నాలుగు మూలలు సగర్వంగా చూసింది

చీటికి మాటికి కోర్టు కెక్కడం చీద రెత్తింది కాబోలు

హైకోర్టు భవనం మీద చింతతో చిందిన చినుకు

ప్రక్కనే వున్న మూసీనదిలో పడి ముక్కు మూసుకుంది

శాసన సభా శిఖరం మీద చల్లగా జారిన బిందువు

ఆకసం వంక తల యెత్తి చూసి
చాలిక వర్షమని శాసించింది.

అంతటితో వాన వెలిసింది
అదీ నగరంలో వాన
నాకు తెలిసిన నగరంలో వాన
అంటే—
హైదరాబాదులో వాన.

—కుందుర్తి

## గోదావరి

త్ర్యంబకాచల దివ్య రాజీవ కర్ణికా
స్రవ దచ్ఛతర మాకరంద ధార
భద్రాద్రి రఘునాథ పావన సేవనా
పాదియౌ విష్ణు పాదోదకమ్మ
నవరత్న విలస దర్ణవ రాజరాజన్యు
నాత్మీయ ముగ్ధ శుద్ధాంతజనము
స్వాఘమర్షణ జాత హర్ష భృద్గౌతము
లాలన మురియు గారాల కూచి

ప్రకట చాళుక్య వంశ రాజరాజ
భూసుపర్వాధినాథ కేళీ సరస్సు
ఆంధ్ర భూభాగ నిత్య కళ్యాణ వల్లి
గౌతమీ దేవి మముఁ బెంచు కన్నతల్లి

ఓ గోదావరి తల్లి ! ని న్గనిన నేవో మాతృ సాన్నిధ్య లీ
లా గంధమ్ములు తోచి నెమ్మదిని చల్వల్ నిండు; నీ యంకపీ
ఠాగారమ్మున బాల్యమాదిగను ధన్యంబయ్యె నా జన్మ నీ
తరాగానంత పయస్సమాకలన పుత్ర స్ఫూర్తి నుప్పొంగెదన్.

నావలె నీ యొడిన్ పెరిగినా ,డట వే భవభూతి తొల్లి త
ల్లీ వివరమ్ముగా పలుకలేని పురాహృదయానుబంధముల్
మోవగ నిన్దలంచి పరిముగ్ధుడగున్ రసవత్కవిత్వ సం
భావన నీ మనోజ్ఞ గరిమమ్ములు మాటికి పాటఁ బాడెడిన్

వేసవి తొడిమెల వీడి జల్లల రాలు
కుసుమ సంతతి నిన్నుఁ గొలిచినాఁడు
నీ పట్టు టిసుక తిన్నెల నంచ యాటల
సీతమ్మఁ బసిపాపఁ జేసినాఁడు
చల్లని నీ గుండె ఝల్లన రఘురాము
ప్రణయ బాధాగాథ పలికినాఁడు
మగణాల నీ నీట సొగయు నడవి సౌరు
చూచి చూచియుఁ దల యూఁచినాఁడు

జననీ ! నీ చెంతఁ బెరిగిన జంతు వృక్ష
ములను గూడ బంధువు లంచు మురిసినాఁడు
ఎంత చిక్కని ప్రేముడి నిడెనొ—నిన్ను
తల్లిగాఁ బుట్టినిల్లుగాఁ దలఁచినాఁడు

ఓ పురాణ స్రవంతికా ! యుగయుగాంధ్ర
శశి విశద కీర్తి బింబిత స్వచ్ఛ హృదయ !
ఏల మౌనయాత్రా విధి నేగె దమ్మ ?
నిలిచి యొక మా పురాకథఁ బలుక రాదె !

శ్రీ విష్ణువర్ధన క్షితిపాల మౌళి యే
ప్రియ పథమ్ములు మాకు వినిచె నమ్మ ?
సకలాంధ్ర సుకవితా సార్వభౌముఁడు 'నన్న'
దేశికుం డేమి సందేశ మొసగె ?
ఆంధ్ర ప్రతాప గ్రీష్మార్కులు మా రెడ్డి
ప్రభువులు మా కేమి పలికి రమ్మ?
కస్తూరి భోగి మా కవిరాజు నెత్తావు
లీను నే కవిత నీ లోనఁ గదలు ?

నాటి తెలుఁగుల దీ పరిపాటి, మేటి
తేజ మే మయ్యెనో యని తెల్లబోయి
గతమునకు బిట్టు శోకింప గాదు ; మాదు
చేవ చరితలు దెలిపి యాశీర్వదింపు !

— ఇంద్రగంటి

## చెట్లు కూలుతున్న దృశ్యం

ఆశలేదు ఆస్కారంలేదు
ఫలానా రోజు శాపం ఆఖరౌతుందనే హామీ లేదు
ఫలానా రోడ్డు గమ్యం జేరుస్తుందనే సూచన ఎక్కడా ఏమీ లేదు
జీవితం ఎప్పుడూ ఇలా కన్నీళ్ల ప్రవాహంగానే
సాగుతుం దనుకుంటాను
రోడ్డు పొడుగునా చెట్లు కూలుతున్న దృశ్యాలనే
చూపుతుం దనుకుంటాను

ఐతే ఇప్పుడు అక్షరాలా నిజం
మిత్రుడు వెంకట్రావు జీవితంలో చెట్లు కూలుతున్నమాట నిజం
లేకుంటే ఎంతో అందమైన సాయంత్రం కదా
ఇలా అపస్వరాలు వినపడటం జరుగదు

రోడ్లమీద ధూళీ దారిద్ర్యం సమస్తం మిత్రుడు
వెంకట్రావు ముఖంమీదనే 'టచ్చాడుతూ' ఉండటం సభవం కాదు
అసలు వెంకట్రావు ముఖం గాలీ వెల్తురూ లేని
గదిలాగా మరీ ఇంత దీనంగా ఎన్నడూ ఉండనే ఉండదు
ఐతే ఇప్పుడు నిర్ధారణగా చెప్పుకోవచ్చు
మిత్రుడు వెంకట్రావు ప్రస్తుతం ఒక నిరుద్యోగి అని
మరీమరీ రూఢిగా చెప్పుకోవచ్చు

అంతే కాదు ప్రస్తుతం మిత్రుడు వెంకట్రావు కాలం అనే
గరుడపక్షి ఎక్కడ ఏ ముళ్ళ చెట్లమీద
విహారం చేస్తూ ఉందో కూడా మనం ఊహ చేసుకోవచ్చు
హృదయ విదారకమైన ఒక దృశ్యం కళ్లారా చూడవచ్చు

తలక్రిందులైన స్వప్నంమీద శల్యాకారంగా కూర్చున్న కుర్రవాడు
ఆపాదమస్తకం సూదులతో ముస్తాబై ఉన్నవాడు
అతని ముఖం నిండా స్ఫోటకపు మచ్చలు
కళ్ళలో శిలా విగ్రహాల వీక్షణలు
అతని చుట్టూ పరాజయ భారంతో క్రుంగుతూ ఉన్న వృక్షాలు

ఇదే దృశ్యం ఇంకా భారీ ఎత్తున భూతద్దాలతో చూడవచ్చు
మిత్రుడు వెంకట్రావు ప్రస్తుతం ఎక్కడ ఏ వేళ
ఏం చేస్తూ ఉంటాడోకూడా మనం ఊహ చేసుకోవచ్చు
నిరుద్యోగి వెంకట్రావు నిత్యం ఆకాశం క్రిందనే
ప్రస్తుతం నివాసం చేస్తూ ఉంటాడు
రెండుకాళ్ళ వాహనంమీదనే నగర సంచారం చేస్తూ ఉంటాడు
అడుగడుగునా తన జీవితం పేకమేడలై కూలుతున్న
దృశ్యాన్ని చూస్తూ
నగరం అంతటా అపస్వరంలా వ్యాప్తమౌతూ ఉంటాడు

నిరుద్యోగి వెంకట్రావు రోడ్లమీద నడుస్తూ ఉంటే
సమీపంలో ఎక్కడా జన సంచారం ఉండదు

చెట్లమీద ఆకు సైతం అల్లల్లాడదు
టెలిఫోన్ తీగల్లలో వార్తాప్రసారం సాగదు

నిరుద్యోగి వెంకట్రావు నగరం నడివీధిలో తన జీవితాన్ని
తెరుస్తూ ఉంటే
ఎందుకో అకారణంగా సూర్యుడు ఖిన్నుడౌతాడు
ఆగ్రహం పట్టలేక భూదేవి బ్రద్దలౌతుంది
ధర్మదేవత ఉన్న ఒక కాలూ విరుచుకుంటుంది

నిరుద్యోగి వెంకట్రావు గాలిలో ధూళిలో
ఎండుటాకులా సుడిగుండం తిరుగుతూ ఉంటే
నగరంలో గృహస్థులు ఆ రోజు సన్యాసం పుచ్చుకుంటారు
పిల్లలు గల తల్లులు బావిలో దూకుతారు
విద్యార్థులు పుస్తకాలు నడివీధిలో తగల బెడతారు

నిరుద్యోగి వెంకట్రావు నగరం గుండెలలో సాలీడులా
అల్లుకుంటూ ఉంటే
ప్రభుత్వ భవనాలలో ఎక్కడా ఒక్క క్షణం పాటు
ఎవరికీ ఊపిరి ఆడదు
కాలం కాగితం పట్టుకున్న అధికారి చెయ్యి దానంత
టదే రాజీనామా పత్రం మీద సంతకం పెడుతుంది
ప్రభుత్వ భవనాలమీద జండా సిగ్గుతో తల వాల్చుకుంటుంది

నిరుద్యోగి వెంకట్రావు తన ఆకలిని రాళ్లలో రప్పలలో
దాచుకుంటూ ఉంటే
రాజకీయవేత్తలు వాటిని వేలంపాటలలో కొనుక్కుంటారు
విషాదం యొక్క రంగు ఎలాఉంటుందో తెలుసుకునే
టందుకు కవులూ చిత్రకారులూ అతని కన్నీళ్ళమీద
పరిశోధనలు సల్పుతారు
అతని పాదధూళిలో చీకటి పుట్టుపూర్వోత్తరాలు వెతుకుతారు

నిరుద్యోగి వెంకట్రావు తన బాల్య స్మృతులు తలచుకుంటూ ఉంటే
నగరంలో ఆ రోజు పసిపిల్లలు అన్నం ముట్టరు
పువ్వులు కోసుకుంటున్న పిల్లలను పాము కరుస్తుంది
దొడ్లో గున్నమామిడిచెట్టు ముమ్మాటికీ నేల కూలుతుంది

నిరుద్యోగి వెంకట్రావు ఈ నగరంమీద ఒక మచ్చ
బాధ అనే దీపం పట్టుకొని
సర్వనాశనం అనే తాళంచెవి పట్టుకుని
వెంకట్రావు జీవితం అనే చీకటి నరక కూపంలో
భయంకరమైన ఆశ్చర్యాలు ఇంకా అనేకం చూడవచ్చు
జీవితంమీద ఇంకా నమ్మకం ఉన్నవాడు వెంటనే
అక్కడే ఉరి పోసుకుని చావటం ముమ్మాటికీ సంభవం కావచ్చు

నిరుద్యోగి వెంకట్రావు ఈ నగరం ముఖంమీద నిజంగా మచ్చ
నిరుద్యోగి వెంకట్రావు చావడు

చావటం అనే మహా పాపం చెయ్యకుండా
న్యాయాధిపతులు ఎప్పుడూ అతన్ని కాపాడుతూ ఉంటారు
రోడ్లమీద భిక్షకులు అతనిలో ఎప్పుడూ కొత్త వూపిరి
పోస్తూ ఉంటారు
జీవిత మాధుర్యాన్ని గూర్చి చీమసైతం అతన్ని
హెచ్చరిస్తూ ఉంటుంది

నిరుద్యోగి వెంకట్రావు ఎప్పుడూ చావడు
అంచేతనే అందమైన ఈ సాయంత్రంవేళ నగరం
అంతటా అపస్వరాలు
వెంకట్రావు నడుస్తున్నంత మేరా చెట్లు కూలుతున్న దృశ్యాలు

—అజంతా

## కలలో పిలుపు

జాళువా తెరచాప కెరటాల జీరాడ
సాగినది సంధ్యా ప్రవాళ నౌక

జలధిలో జలతారు వలలోన మీనమై
మిలమిలల మెరిసినది చంద్రవంక

తెలి మంచుతెరల కావల తరళ హసితమై
వెలిగె ధ్రువతారకా దీపకళిక

ఎలుగెత్తి ఎవరో ! అవలి తీరమున నిలిచి
పిలిచిరో కలగించె నొక్క కేక !

అలక లల్లన సోకి వలిగాలి నిట్టూర్చె !
కలకలము రేగె రిక్కల పలకరింతలో
కళుకాల మీ లీల కల తలాడగ సోలి
కలవరింపనేల ! లే లెమ్ము ! నెచ్చెలీ !

— గణపతిశాస్త్రి

## నిష్క్రమణం

వెడతాను మరి, సెలవు.
విడిచి వెడుతున్నాను నా కండ్లు
వెలలేని కలల బరు వెక్కి
పండి రాలిన పండ్లు
వెదకి వేసారి విశ్రమించినవ్వీపండ్లు
వెడతాను మరి, సెలవు

ఎన్నో దినాలు గడిపాను మీ మధ్య
ఎన్నో దినాలు నడిచాను ఈ రథ్య
వెడతాను మరి, సెలవు.

ఎన్నో దీపాలు వెలిగించుకొని వచ్చాను.
ఎన్నో కలలు మోసుకొని వచ్చాను
ఎన్నో జలలు నింపుకొని వచ్చాను
ప్రవేశించాను
ఈ విచిత్ర భవనంలోకి
ఈ విశాల సదనంలోకి
పాటవలె
పరిమళం వలె

ప్రశ్నవలె

పండు వెన్నెల వలె

పైరుగాలి వలె

మాట రాని మౌని వలె—

ఎన్నో ముఖాలు కనుపించినవి

ఎన్నో కండ్లు ఎక్కుపెట్టినవి నాపైన

ఎన్నో గుసగుసలు రుసరుసలు

ఎన్నో కంఠాలు ప్రశ్నించినవి

నీ వెవరు ? నీ వెవరు ? నీ వెవరు ?

నే నెవరు ? నే నెవరు ? నే నెవరు ?

ఏవీ నీ కలలు చూప మన్నారు

ఏవీ నీ దీపాలు వెలిగింప మన్నారు

ఏవీ నీ జలలు ప్రవహింప మన్నారు

తక్షణం మీ ముందు

మంత్రించి నిలిపాను

వేలవేల చక్కని చుక్కల గగనాన్ని

వెలిగించి చూపాను

విశాల వినీల విశుద్ధ దీపమాల

ఒక నిమిషం

విషం వీచింది

అన్నీ ఆరాయి.

అర్థించాను___
బోధించాను___
తపించాను___
శపించాను___
మానవుడా ! ఇది క్షంతవ్యం కాదుసుమా !
వెడతాను మరి, సెలవు.

భూతకాల భూతశాల వదలి
వర్తమాన విషవర్తులాన్ని ఛేదించుకొని
భావి కాలపు నల్లని ముసుగు ధరించి
వెడతాను మరి, సెలవు.

నాకు లోకం లేదు నాకు శోకం లేదు
నాకు బంధం లేదు, నాకు బాధలు లేవు
ఏదో చల్లనైంది నాలో నేడు
ఏదో ఎన్నడో మరచింది
జ్ఞాపకం వస్తోంది.
వెడతాను మరి, సెలవు.

వినిపించె నేదో మెల్లని పిలుపు
మూయండి నా వెనుక విశ్వపు తలుపు.

— రామదాసు

## లోకాలోకము

ఆకసము బీజ ప్రదాతగ
అవనియే ఒక ఆద్య మాతగ
కానగల్గిన మానవునకు జ
గజ్జనాళి ఒకే కుటుంబము

నింగి లోపల లేవు ఎల్లలు
నీరధిని కనరావు ఎల్లలు
ఎందు కీ ధరణి తలమ్మున
ఇరుకు వాడలు, ఇనుప గోడలు

అన్ని జాతుల కొకే సూర్యుడు
అన్ని నేలల కొకే చంద్రుడు
అయినచో జాత్యహంకారము
ఆటవిక తత్త్వమ్మ కాదా ?

ఏ కులము వెన్నెలది ? తెమ్మెర
లెట్టి జాతికి చెందినట్టివి ?
అట్టిదే కద మానవత్వము
అన్నిటికి ఎత్తైన సత్యము

ఊహలే రెక్కలుగ జేసి మ
హోన్నతముగా ఎగిసి చూచిన,
వసుధ యంతయు కన్పడును పసి
వాడు విసిరిన బంతి పోలిక

ఒక అహంత మనస్సులో వే
రూరు తొల్తగ; దాని భాహిర
శాఖలే 'నా దేశ మిది నా
జాతి యిది' యను భావ రేఖలు

ఆత్మ పాలసముద్ర మటు నిం
డార విచ్చిన దండి మనిషికి
విశ్వ గోళము పండువెన్నెల
వెన్ను లొరిగిన పంట పొలమగు

మనసు నంటిన అహంభావము
మంచు మాదిరి కరిగి పోయిన
మనిషి లోపలి దేవతాత్వము
మణీ ముకురము వోలె భాసిలు

స్నేహ పవమానము అగస్త్య ఋ
షీంద్రు పోలిక సాగిపోయిన
నెత్తి బిగిసిన గిరులు సైతము
మెత్తబడి మును సాగిలంబడు

మనుష లంతరు అన్నదమ్ముల
మాదిరిగ జీవించ గల్గిన
మర్త్య లోకమె దివ్య పదవికి
మారు పేరై పరిమళించును

చంద్ర మండల మందుకొనన దీ
శక్తులను వెచ్చించు కన్న
మానవుని దేవతగ మార్చెడు
మార్గమును కనుగొనుట మిన్న

— నారాయణ రెడ్డి

## సౌందర్య శిఖ

ఉజ్జ్వల తర సంగీత తరంగ
స్పందనల కదలికలతో
వచ్చింది ఆమె కాంతిమతి !
నీడ ఎరుగని దీపశిఖ !

అంధకార శిలాపంక్తులను అకస్మాత్తుగా
చందన శీతల ఛాయాగ్ని వృక్ష సమితిగా:
స్వర్లోకానికి ప్రతిబింబంగా, మానవ జీవిత శకలం
ఒక దివ్య దశగా పరిణమింపజేయు కాంతిపుంజం

ఉదయం తీసుకున్న మొదటి నిశ్వాసంలో
అనంతకోటి ఆశాపతాకల ఉత్సాహ దీప్తి
తెరచిన కళ్ళనుండి చిందు అమృత బిందువులు
ముఖంలో అలలు అలలు సాగు స్వర్ణ కాంతి హాసం

వర్షాగమ వేళా శీతల సుకుమారవాయువు వలె
లిప్తల మెట్లపై అడుగుల చప్పుడుతో వస్తూన్న
ఆమె పాదాలముందు బారులుగా విచ్చిన వెలుగులు
దృష్టిపథంలో గుత్తులుగా ప్రబ్బికొన్న నీలి మబ్బులు.

హృదయంలో పల్లవించి పెదవిపై కుట్మలించి
వాక్కులో సుమించిన ఒక మహా దివ్యానుభూతి;
బహు వర్ణకాంతి సమ్మిశ్రిత వాయు ప్రసార వలయం;
లిప్తలు పరిమళ భరితంచేయు సౌందర్య శిఖ.

ఝంఝానిల తీవ్రత్వం నైశిత్యం
అణగిన మొదటి క్షణం వలె,
పరిమళ వదనంపై రోచిర్హాసంతో
నిల్చిన హిమబిందువు వలె;

సర్వ ధ్వనులు సంగీత స్వర విశేషాలవలె తనలో
ఆనందంతో లినీకరించుకున్న అఖండ శాంతివలె,
ఆవిష్కృతమైన అవ్యక్త నాద ప్రతిబింబం
మూర్తీభవించిన, అమృతభర సౌందర్య లహరి !

ఆశావలయ పరివేషితమైన అఖండ శాంతి,
ఆమె వెంట నంటి పరుగెత్తి వచ్చింది మూర్తి కట్టి.
ఇతరులచే భేద్యమై అగోచరమైన నా అంతఃకరణంలో
ఆమె కదలిక, కాలచక్రంయొక్క లయాత్మక గమనం.

రవి కిరణం భూమిపై అడుగిడక ముందే
ఒక పల్చని గాలి తెరపై ఊహ చిత్ర పరంపర
సృష్టించుచున్న ఆకాశ శతపత్రంవలె — ఆమె.

గగన భాగంపై మేఘ పంక్తి అవతరించగనే
స్వాదుతర సంగీత మాధురీ స్విన్నమై. తనలో తా
పరవళ్ళు త్రొక్కు రోచి రుదార సముద్రంవలె —నేను.

— మాదిరాజు రంగారావు

## కలహించిన అబ్బాయి / అమ్మాయి

మనం ఎందుకు పోట్లాడుకున్నామో
ఇవాళ ఇద్దరికీ జ్ఞాపకం లేదు
పోట్లాడుకున్నామో లేదో కాని
మాట్లాడు కోవటం మానేశాం

నువ్వు మేడ దిగి రావు, అది రజతాద్రి
నేను మేడ ఎక్కను, ఇది సుతలం
అంతటితో మన మధ్య ఒక నల్లని ఇనుపతెర
అలుక వహించిన నీ మోమున జేగురుచాయ

రోజులు చూస్తూ వుండగానే
రెక్కలు చాచి పరుగెత్తాయ్.

కెఫేలో, బాటలో మనం
పరస్పరం చూసుకుంటూ
ప్రక్కలకు తొలగిపోయాం

సమస్యల సాయం సంధ్యా సమయంలో
నీరధి నితాంత నీలిమ
నిర్మల ప్రాతర్వేళ
పచ్చికపై మంచు చినుకుల సొగసు
ఇద్దరం చూస్తూ గడపిన
అమృత ఘడియల సంఖ్య ఎంత ?

ఒక మధ్యాహ్నం —— కోపం వచ్చిన భగవానుడు
కొళాయి తిప్పినట్లుగా వర్షం
షవర్ బాత్‌గా ప్రారంభమై కుండపోతగా మారిన వర్షం
నీళ్ళతో నింగి నుండి గోడ కట్టినట్లు
ఆ మధ్యాహ్నం పడిన వానలో తడిసిన మనం
ఆకాశ మెత్తు పెరిగి రాకాసి కేకలు వేసుకుంటూ నడవడం
అంత త్వరగా నువ్వు మర్చి పోగలవా

వర్షానికి ముందు అందమైన ఇంద్రచ్ఛాపం
మన హర్షానికి పర్యాయ పదం
నర్తనం చేయడానికి మయూరాల్లేవు నగరంలో
అయితే అప్పుడే కేకులను తిన్న మనం కేకుల మయ్యాం.

జేబు ఖాళీగా ఉంటే ఏ నవాబునో బతిమాలి
మూడో నాలుగో తీసుకొని మంచి పుస్తకం కొని
ఏక కాలమందు చదువుతూ పొందిన "థ్రిల్"
రికార్డు చేసే యంత్రం ప్రస్తుతానికి లేదు

పశ్చాత్తాపంతో బాధపడుతున్నాను
అనుక్షణం ఆనందంగా
బ్రతకడం నా జీవితాశయం
అన్ప్లెజంట్‌నెస్ భరించలేను
పుస్తకం ప్రేయసీ స్నేహితులు
వరుసక్రమం మార్చినా ఫరవాలేదు
ఇవి చాలు నాకింకేమీ వద్దు.

— గోపాల చక్రవర్తి

